

సౌందర్య లహరి [ బేలూరు శిల్పం ]

ఫొటో: వి. కేశవశర్మ.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 19
9-1-57

దుర్ముఖ పుష్య శుద్ధ అష్టమి బుధవారం

 విషయానుక్రమణిక 

ముఖచిత్రం : కృష్ణకుమారి.

శ్రీరామరక్ష— 3
బుడుగు! చిచ్చుల పిడుగు!— 6
న్యూఢిల్లీ లేఖ—"శ్రీకృష్ణ" 9
ప్రతిమా ప్రణయం—"వినాయక" 11
అదృష్టం ఉండాలి—బి. విద్యాసాగర్ 13
దూరమైన దగ్గర కొండలు—ఏ. రామరత్నం 17
మహాకవి సింహాసనము—పి. గణపతిశాస్త్రి 21
మారిన మతలబు—కుమారి అనూరాధ 25
మంత్రాలు: నమ్మకాలు— 27
మాంత్రికుడు మాండ్రేక్— 28
అభిమాన సినీతార—పవని నిర్మల ప్రభావతి 31
వ్యర్థమనోరథం—జమ్మి సుశీలారాణి 33
వనితాలోకం—వంకినేని జానకీదేవి 35
మాఊరి మఱ్ఱిచెట్టు—
కమ్మిసెట్టి వెంకటేశ్వరరావు 44
మాటవిలువ—
పాలంకి వెంకటరామచంద్రమూర్తి 45
మృత్యుదేవత—"పారిజాత" 47
సినిమా— 49



వరంగల్లులో ఇటీవల జరిగిన ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహిళా సభలలో పాల్గొన్న స్త్రీలు: కూర్చున్నవారు: (ఎడమనుండి), శ్రీమతులు వెనిశెట్టి రత్నం, మదూరి విజయాదేవి (ఆహ్వాన సంఘాధ్యక్షురాలు), అర్వపల్లి సత్యవతిదేవి (మహిళా సభాధ్యక్షురాలు), జె. యశోదాదేవి, పడశాల హైమవతీదేవి. నిల్చున్నవారు: పి. సుశీలాదేవి, శీలా పారిజాతం, కె. కమలాదేవి, కందకట రాజమణిదేవి, [illegible]

# శ్రీరామ రక్ష

ఆంధ్ర మద్రాసు రాష్ట్రాల సరిహద్దు సమస్య పరిశీలనకు కేంద్ర న్యాయ వ్యవహారాల మంత్రి శ్రీ పటాస్కర్ రానూ వచ్చారు; పోనూ పోయారు. వీరి రాకడకూ, పోకడకూ, వస్తారొస్తారని మనం ఎదురు చూసినన్ని రోజులు పట్టలేదు. మద్రాసు ప్రభుత్వ సచివాలయంలో ఈ వివాదాన్ని విచారణచేసింది రెండే రెండు రోజులైనప్పటికీ, వివాదానికి సంబంధించినవిషయాలన్నిటినీ తాము ఇట్టే ఆకళింపు చేసుకున్నట్లు శ్రీ పటాస్కర్ పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో తెలియజేశారు. మద్రాసుప్రభుత్వం తరఫున ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్, ఆర్థికమంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం, వ్యవసాయ మంత్రి శ్రీ భక్తవత్సలం ఆంధ్రప్రదేశ్ నుంచి తమకు రావలసిన భూభాగాల భోగట్టాను పటాస్కర్‌కి పటాలతోసహా అందజేశారు. తమకే వుండి తీరవలసిన హోసూరు విషయంలో తమ "సంజాయిషీ" మాత్రం చెప్పకున్నారు. సేలం జిల్లాలోని హోసూరు వివాదంపై వివరాలన్నిటినీ మధ్యవర్తికి అందజేయవలసిన బాధ్యత వీరు తమదికాదని భావించారో, లేక, ఆ విషయమై భోగట్టా ఎలాగూ ఆంధ్రమంత్రులే అందజేస్తారు కదా అని వదిలివేశారో తెలియదు. ఏది ఏమైనప్పటికీ, మద్రాసు మంత్రులతో జరపవలసిన చర్చలు శ్రీ పటాస్కర్ ముగించారు; న్యాయంకాని పని ఏదీ చెయ్యననే హామీ ఇచ్చారు. క్రమాన్ని అక్రమంగానూ, అక్రమాన్ని క్రమంగానూ తారుమారుచేసి ప్రదర్శించాలని కొందరు తమిళ ప్రబుద్ధులు ఎంత ప్రయత్నించేసినప్పటికీ, కేంద్రమంత్రి అందరి వాదనను సానుభూతితో విని తనకు తోచినట్లు, సాధ్యమైనంత త్వరలో, న్యాయమే చేస్తానని హామీ ఇవ్వక తప్పలేదు. మధ్యవర్తి శ్రీ పటాస్కర్ చివరవరకు ఈ మాట మీదే నిలబడి వుంటారని ఆశిద్దాము.



డిసెంబరు 31 వ తేదీన, తమ 80 వ ఏట కాలధర్మం చెందిన మధ్యప్రదేశ్ ముఖ్య మంత్రి రవిశంకర్ శుక్లా.

* * *

"ఇది భూగోళానికీ, జనాభాకు, భాషకు సంబంధించిన సమస్య. సరిహద్దులకు ప్రత్యేకంగా వెళ్ళి, ప్రత్యక్షంగా చూడవలసిన అవసరమేమీ లేదు," అన్నారు శ్రీ పటాస్కర్. ఇది జనాభాకు, భాషకు సంబంధించిన విషయమన్న మాట నిజమే. జరిగిన గొడవంతా ఏకరాష్ట్రంగా వుండగా జనాభా లెక్కల సేకరణలోనే జరిగిందన్నదే ఆంధ్రుల వాదన. కేవలం తప్పుల తడకగా, అభూతకల్పనలుగా ఇటీవలతయారైనజనాభా లెక్కలను ఆధారంగా తీసుకొని సమస్యను పరిష్కరిందాలంటేసాధ్యపడే విషయంకాదు. అలా పరిష్కరించాలని ప్రయత్నిస్తే,అది న్యాయమనిపించుకోదు. ఇందూరులో అఖిల భారత కాంగ్రెస్ మహాసభ సందర్భాన సాగించే సంప్రతింపులలో ఆంధ్రమంత్రులు జనాభా లెక్కల అవకతవకలను శ్రీ పటాస్కర్ దృష్టికి తేకమానరు. ఉత్తరోత్తరా శ్రీ పటాస్కర్ సమక్షంలోనే కొనసాగే ఆంధ్ర మద్రాసు మంత్రుల సమష్టి సమాలోచనలలోకూడా ఈ లెక్కల గొడవ రభస గాకమానదు. అందుచేత, సరిహద్దు వివాదాన్ని క్షుణ్ణంగా పరిశీలించాలన్నా, ఉభయ వర్గాలకు సంతృప్తికరంగా వివాదాన్ని పరిష్కరించాలన్నా, జనాభా లెక్కలను కొత్తగా సేకరించనైనా సేకరించాలి; లేదా, వచ్చే జనాభాలెక్కల సేకరణ వరకూ అగనైనా ఆగాలి. అంతేగాని, ప్రత్యక్షంగా సరిహద్దు పరిస్థితులను చూడకుండా ఇటీవలి వివరాలమీదే ఆధారపడి ప్రయోజనం లేదు. దీన్ని మధ్యవర్తి ముందుముందైనా గ్రహించక తప్పదు.

* * *

త్రమకు ఎటు వీలుగావుంటే అటు వాదించి పంతం నెగ్గించుకోవడంలో అరవలకు అరవలే సాటి. తమిళరాజ్యసంఘ ప్రతినిధులు శ్రీ శివజ్ఞానగ్రామణి ప్రభృతులు చిత్తూరు జిల్లాలోని చిత్తూరు, చంద్రగిరి, పలమనేరు, తిరుత్తణి, పుత్తూరు, కాళహస్తి, నెల్లూరు జిల్లాలోని సుళ్ళూరుపేట తాలూకాలన్నీ వివాదగ్రస్తమైనవనీ, వీటిని మద్రాసురాష్ట్రములో చేర్చవలసి వుంటుందనీ శ్రీ పటాస్కర్‌కు విజ్ఞప్తిచేశారు. వీరి విజ్ఞప్తిలో పొన్నేరి, తిరువళ్ళూరు, హోసూరు తాలూకాల ప్రసక్తికి స్థానమే లేకపోయింది! పైగా, గ్రామాన్ని ప్రాతిపదికగా తీసుకుంటే అడవులు, సరస్సులు, కొండలు మొదలైనవాటివల్ల అనేక చిక్కులు వస్తవనీ, సరిహద్దులు నిర్ణయించడంలో తాలూకానే ఒక ప్రాతిపదికగా తీసుకోవాలనీ కూడా వీరు కోరారు; భాష నేగాక, పరిపాలనా సౌలభ్యాన్నికూడా పరిగణించాలన్నారు. అంటే, వస్తే పూర్తిగా తాలూకా రావలసిందేగాని, ఏవో కొన్ని గ్రామాలు వస్తే వీరు తృప్తి పడరన్నమాట!

* * *

"నాకు ఈ అరవ పితలాటకం వద్దు బాబో! నన్ను హాయిగా, నిశ్చింతగా, నిశ్చలంగా ఈ తెలుగు కొండలమీదే, తెలుగు ప్రజల మధ్యనే వుండనివ్వండి," అని ఆంధ్రుల ఇలవేల్పు నెత్తీన నోరు పెట్టుకొని అంటూవున్నా, ఏడుకొండలవాణ్ణి కొండలతో సహా అమాంతం తమిళ సరిహద్దులలోకి లాగాలనే ప్రయత్నాన్ని తమిళ సోదరులు ఇప్పటికీ విరమించినట్లు కనిపించదు. ముఖ్యమంత్రిగా వుండగా రాజాజీలాంటి ప్రముఖులే 'తిరుపతి తెలుగువారిది, దానిమీద అరవలకు హక్కులేదు' అని ఖండితంగా చెప్పివేయడం జరిగింది. అయినా, కొందరు అరవలు తమ కుయుక్తులను మానలేదు. తనవద్దకువచ్చి తలనీలాలు ఇచ్చేయాత్రికు లందరికీ 'నీలికుళాయిలు' తగిలించిపంపించే తిరుపతి వెంకటేశ్వరుడికే 'కుచ్చులకుళాయి'తగిలించి 'టోపీవేద్దామని' తమిళుల ఆలోచన. చంద్రగిరి తాలూకా మొత్తం తమకే చెందాలనీ, అరవరాష్ట్ర సరిహద్దు తిరుపతివరకూ పాకవలసిందేననీ వాదించడంలో ఇది గాకపోతే మరేమిటి అర్థం? చావుకుపెడితేగాని, లంకణాల వరకైనా దిగదనే సామెతప్రకారమే వీరు వ్యవహరిస్తున్నారు. కొండకు వెంట్రుకకట్టి లాగడానికి ప్రయత్నిస్తే, వస్తేకొండవస్తుంది; లేకపోతే, వెంట్రుక పోతుందన్నదే అరవల ధీమా! ఇలా వాదిస్తే, వస్తే తిరుపతి వస్తుంది; లేకపోతే, కనీసం తిరుత్తణి అయినావస్తుందని వారి ఆశ. ఆశకు అంతెక్కడ? ఏడుకొండల వాడిముందు ఈ "అరవపప్పులు" ఉడికేనా

## 3

కాళిదాసమహాకవి శిష్య ప్రశిష్యగణంతో కలిసి కుంతలరాజధాని కల్యాణ నగరానికి విచ్చేయగానే నగర కవి విద్వాంసులలో ఒక అపూర్వమైన సంచలనం చెలరేగింది.

ఆమహాకవి రాజాస్థానాలు సందర్శించడం ఇంతవరకు వారెన్నడూ విని ఉండలేదు. కుంతలదేశ విద్వాంసులలో కాళిదాస ప్రఖ్యాతి బాగా విస్తరించినా వారెవరికీ కవిసందర్శన భాగ్యం ఇంతవరకెన్నడు కలగలేదు.

అందోళికాది వాహనాల కలకలంతో విచ్చేసిన ఆ మహావ్యక్తిని చూడగానే కల్యాణనగర విద్వాంసు లహమహమికతో తమ ఆతిథ్యం స్వీకరించవలసిందని మహాకవిని ప్రార్థించారు. కాళిదాసకవి ఎందరి ప్రార్థనలని మన్నించగలడు? చివరికి కుంతల రాజ్యాస్థాన విద్వాంసుడు మార్తాండభట్టు భవంతిలో విడిది చెయ్యడాని కంగీకరించాడు.

కుంతలరాజ్య ప్రధానామాత్యునికీ మహాకవి ఆగమన వృత్తాంతం మరింత వింతగా కనబడింది. విక్రమాదిత్య సభాలంకారమైన ఆ మహాకవికి కుంతలదేశాస్థానంవంటి సామాన్య సంస్థానం సందర్శించవలసినంత అవశ్యకత ఏదీ లేదని మహామాత్యుడు మంత్రిగుప్తుడు ముందుగానే గ్రహించివేశాడు. దీనిలో ఏదో అంతరార్థం అంతర్నిహితమై ఉండితీరాలని అతడొక్క క్షణంలో ఊహించుకొన్నాడు. వెంటనే ఆ విషయం విజయేశ్వరవర్మకు తెలియజేశాడు.

కుంతలరాజ్యం విక్రమాదిత్య చక్రవర్తి విశాల సామ్రాజ్యానికి సరిహద్దులోనే ఉంది. అయితే ఉజ్జయినీ సామ్రాజ్యధోరణి కుంతలదేశానికంత సన్నిహితంగా కనబడకపోవడంవల్ల విజయేశ్వరవర్మ తనకిరుగుపొరుగు దక్షిణాపథ రాజ్యాలతో సంబంధ బాంధవ్యాలభివృద్ధి పొందించుకోవాలని నిశ్చయించాడు. ఆ పద్ధతి విక్రమాదిత్యుని వైమనస్యానికి దారితీయగలదని అతనికి తెలియకపోలేదు. కాని మరి గత్యంతరం లేదనుకొని అతడామార్గం అవలంబించాడు.

కాని మహామాత్యుడు మంత్రిగుప్తుని కామార్గం అంతగా రుచించలేదు. విక్రమాదిత్య చక్రవర్తితో బద్ధవిరోధం కుంతలరాజ్యం వంటి చిన్న రాజ్యానికి శ్రేయోదాయకం కాదని అతని భయం. అందుచేత ఏదో విధంగా చక్రవర్తితో స్నేహ బాంధవ్యాలభివృద్ధి పొందించుకోవాలని అతని అభిప్రాయం. బలవత్తర సంపా

[illegible]

దాక్షిణాత్యరాజన్యులెవరు తమవైపు తేరిపార జూడలేరని అతని ధైర్యం.

అయితే విజయేశ్వరవర్మకు, మహామాత్యునికీమధ్య ఏర్పడిన ఈ దృష్టిభేదం ఇంతవరకు అనిశ్చితంగానే ఉండిపోయింది. మహాకవి రాకతో మంత్రిగుప్తుడు తిరిగీ తన అభిప్రాయం కుంతలేశ్వరునికి తెలుపుదు చేసుకొన్నాడు. విజయేశ్వరవర్మ ఎటూ తేల్చి చెప్పలేదు:

"ఇంతకీ ఆ కవీశ్వరు లిక్కడికి విచ్చేసిన కారణమేమో!"

"అది అవగాహన చేసుకోవాలనే నేను వారి సన్నిధికి వెడుతున్నాను"

"ముందువారి అభిప్రాయం గ్రహించండి."

అన్నాడు విజయేశ్వరవర్మ. అంతేగాని అమాత్యుని కంతకంటె ఎక్కువ అధికారం ఇవ్వలేదు. అయినా మంత్రిగుప్తుడా విషయం అంతటితో విడిచిపెటలేదు:

"ఒకవేళ వారి ప్రసంగంలో మన యెడల కొంచెం సౌమనస్యం గోచరిస్తే?

"దాని కేమి! అప్పుడు తిరిగీ ఈ విషయం పునర్విమర్శించుకోవచ్చును"

అని విజయేశ్వరవర్మ ఆ ప్రసంగం అంతటితో ముగించివేశాడు. ఆ విధంగానైనా విజయేశ్వరవర్మ తన అభిప్రాయం వ్యక్తీకరించినందుకు మంత్రిగుప్తుడెంతైనా సంతోషించాడు. వెంటనే మార్తాండభట్టు గృహానికి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం విందు భోజనం ముగించి తాంబూల చర్వణ చేస్తూన్న కాళిదాస మహాకవిని అల్లంత దూరంలో సందర్శించగానే మంత్రిగుప్తుడు నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

తేజస్వి, స్ఫురద్రూపి, అయిన ఆ వ్యక్తి కాళిదాస మహాకవే అయి ఉండవచ్చునని అనుకొన్నాడు. వెంటనే మార్తాండభట్టు మహామాత్యుణ్ని కవి సన్నిధికి తీసుకుపోయాడు. మహాకవిని చూస్తూనే మంత్రిగుప్తుడెంతో మర్యాదగా ప్రసంగం ప్రారంభించాడు:

"మీవంటి మహాకవులు కుంతలాస్థానం సందర్శించడం కేవలం మాభాగ్యమే!"

కాళిదాసకవి తాంబూల సేవకొంచెం విరమించాడు:

"కుంతలేశ్వరులు మహా విద్వాంసులనీ కవీశ్వరులనీ, రసజ్ఞులనీ విక్రమాదిత్యులు ప్రశంసించగా విని వారి నొక్కమారు సందర్శించి పోదామని వచ్చాను."

ఆమాటతో మంత్రిగుప్తుని హృదయంలో ఆశారేఖ రేకెత్తింది.

"వారెంతో కాలంగా మీ కవితామృతం మీ ముఖతః ఆస్వాదించాలని ఉవ్విళ్లూరుతున్నారు. ఆ మహాభాగ్యం నేటికిలాగ ఫలించింది."

ఆ ప్రత్యుత్తరంతో కవి హృదయంలో కూడా ఆశాలేశం వెలిగింది:

"ఆభాగ్యం వారిదికాదు, నాది."

తరవాత ఆ సౌమనస్యధోరణి గ్రహించి మంత్రిగుప్తుడు కవిని అసాయంకాలమే రాజప్రాసాదానికి విచ్చేయవలసిందనీ కుంతల దేశాధీశునికి కవితామృతాస్వాద భాగ్యం కలిగించవలసిందనీ ప్రార్థించాడు.

## ౪

రాజప్రాసాదంలో కవితాగోష్ఠి సన్నాహం జరిగింది. రత్నకంబళాలు పరచిన సభాస్థలిలో ప్రసిద్ధ కల్యాణపుర కవి విద్వాంసులందరు సమాసీనులైనారు.

# ★ మహాకవి సింహాసనం ★

కుంతలాధిపతి విజయేశ్వరవర్మ ప్రత్యేకంగా తన కేర్పాటయిన రత్నకంబళంమీద హంసతూలికలతో అమర్చిన ఒక తలగడకానుకుని కాళిదాసాగమనం నిరీక్షిస్తూ కూర్చున్నాడు.

కాళిదాసకవి సభాస్థలి సింహద్వారంలో ప్రవేశించగానే మంత్రిగుప్తు డతనికెదురేగి సగౌరవంగా లోపలికి తోడుకువాయాడు. విజయేశ్వరవర్మ అది చూచి లేవబోయినట్లు నటించి తన కలవాటైన ధోరణిలో ప్రత్యేకమైన గౌరవం జరిపాడు. అంతేగాని లేచి నిలబడలేదు. సభాస్థలిలో ప్రవేశిస్తూనే కాళిదాసకవి ఒక్కచూపులో అదంతా ఆకళించుకొన్నాడు.

మంత్రిగుప్తు డది గ్రహించాడు. కాని కాళిదాసకవి అది గ్రహించలేదని అనుకొన్నాడు.

నిజానికి విజయేశ్వరవర్మ అది చెయ్యవలెనని చేసిన అమర్యాదకాదు. తన ఆస్థాన మర్యాద ప్రకారమే అతడా విధంగా అతిథి గౌరవ మర్యాద నడిపించాడు.

మంత్రిగుప్తుని కది కొంచెం అనుచితంగానే కనిపించింది. అయినా అది పైకి కనబడనీయకూడదనుకొని కాళిదాసకవిని విజయేశ్వరవర్మ సరసనే కూర్చోబెట్టవలెనని సంకల్పించి సగౌరవంగా మహారాజు సన్నిధికి తోడుకుపోయాడు.

విజయేశ్వరవర్మ అప్పటికి తన తప్పిదం గుర్తించాడు. వెంటనే కవిని తన సరసనే కూర్చోవలసిందని ప్రార్థించాడు.

కాని కవి ఎక్కడా చెక్కుచెదిరినట్లు కనబడలేదు. అల్లాగే ఉల్లాసంగా నవ్వుతూ విజయేశ్వరునికి కొంచెం సమీపంలో రత్నఖచితమైన ప్రదేశంలో కూర్చున్నాడు. అంతేనేగాని రత్నకంబళంమీద కూర్చోలేదు.

అది రత్నఖచితమైన ప్రదేశమే అయినా మహాకవి ఆ విధంగా వట్టి నేలపై కూర్చోవడం మంత్రిగుప్తునికి రుచించలేదు. వెంటనే విజయేశ్వరవర్మ ఆ సంగతి గ్రహించి కవిని తన రత్నకంబళంమీదికి విచ్చేయవలసినదని సగౌరవంగా ఆహ్వానించాడు.

కాని మహాకవి అక్కడినించి కదలనే లేదు. అలాగే చిరునవ్వుల మల్లెపూల పుష్పాంజలి విరజిమ్ముతూ ఆ ప్రార్థనకు ప్రత్యుత్తరంగా ఒక శ్లోకం పఠించాడు. అసలు కవి స్ఫురద్రూపం చూడగానే సభ్యులందరు చిత్రప్రతిమలై పోయారు.

తీయతీయని ఆ మహాకవి గొంతు వినపడగానె సభాసదులందరికీ మరి శరీరాల మీద స్పృహలే సడలిపోయాయి:

"ఇహ నివసతి మేరుః శేఖరః క్ష్మాధరాణాం
ఇహ వినిహితభారాః సాగరాః సప్తచాన్యే
ఇద మహిపతి భోగ స్తంభరత్నాభిరామం
అవనితల మిహైవ స్థానమస్మ ద్విధానాం"

"పర్వతాలకు ప్రభువైన మేరువీ భూతలం మీదనే నివసిస్తున్నాడు. సప్త సాగరాలు ఇక్కడనే కొలువుదీరి కూర్చున్నాయి. ఆది శేషుని పడగలనే స్తంభాల రత్నాలతో సమలంకృతమైన అవనితలమే మావంటి వారికి స్థానం. ఇదే మా సింహాసనం."

ఆ శ్లోకపఠనం పూర్తికాగానే విద్వన్మండలిలో భోరుమని సాధువాదాలు చెలరేగాయి.

మంత్రిగుప్తు డాశ్లోకార్థం కొంచెం మననం చేసుకొన్నాడు: "దీనిలో ఎంతటి వ్యంగ్య మున్నది! మహాకవి తన సహజ వినయ ధోరణిలో తనకు రత్నకంబళాలవంటి రాజాసనాల అవశ్యకత లేదనీ కేవలం ఆస్తరణ శూన్యమైన అవని తలమే తన సింహాసనమనీ అన్నాడు! కాని గభీరమైన వ్యంగ్య ధోరణిలో తాను సప్త సాగరాలతోను, మేరువుతోను సమానుడనని ధ్వనింపజేశాడు. ఆ శ్లోకంలో పైపైకి వినయమే గోచరించింది. కాని దాని అర్థం తరించిన కొద్దీ కవిచక్రవర్తి కుచితమైన రాజసంకూడా గభీరంగా ధ్వనించింది. కనకనే విక్రమాదిత్య చక్రవర్తి ఆయన కర్ధాసనమిచ్చి గౌరవించటం జరిగింది!" అని అనేక విధాలా ఆ మహాకవి కవితాచాతుర్యాన్ని కొనియాడుతూ ఆశ్చర్యపోయాడు.

విజయేశ్వరవర్మకూడా ఆ గభీరవ్యంగ్యం గ్రహించుకొన్నాడు. ఆ శ్లోకంలో అతనికింకొక వ్యంగ్యంకూడా స్ఫురించింది.

విక్రమాదిత్య చక్రవర్తి సింహాసనం సన్నిధిని భూతలం మీద కూర్చున్నా తన రాజగౌరవాదరాలకేమి లోపం రాదని అతనికా క్షణంలో ఒక మెరుపులా ధ్వనించింది.

వెంటనే లేచి కాళిదాస మహాకవిని తాను కూర్చున్న రత్నకంబళం మీద కూర్చోబెట్టుకొన్నాడు. సవినయంగా తానా మహాకవి పాద సన్నిధిని కూర్చున్నాడు. మణిభూషణాంబరాలతో కాళిదాసకవి కనేక విధాలుగా మహారాజ సత్కారాలు జరిపించాడు.

కుంతలేశ్వరుని హృదయంలో జరిగిన ఆ పరివర్తన గమనించిన మంత్రిగుప్తుని కాక్షణంలో ఎంతో సంతోషం కలిగింది.

అటుపిమ్మట మరి నాలుగైదు రోజుల వరకు కుంతలరాజాస్థానం కాళిదాస కవితామృత ధారలలో ఓలలాడింది. ఆ రోజుల్లో విజయేశ్వరవర్మ, కాళిదాస కవి, మంత్రిగుప్తుడు చిరకాల పరిచితులైన మిత్రుల ధోరణిలోనే వ్యవహరించారు. మంత్రిగుప్తుడు కాళిదాస కవి వాక్చాతుర్యానికి ఆశ్చర్యపోయాడు.

క్రమంగా తన హృదయ సంకల్పం కుంతలేశ్వరుని గ్రహించాడు. విక్రమాదిత్యుని సంకల్పం ఫలించడానికి కావలసిన కాళిదాసకవి కవితాచాతుర్యంతోబాటు వ్యవహారచాతుర్యం కూడా బాగా తోడుపడింది.

కవితోత్సవం పరిసమాప్తి కాగానే విజయేశ్వరవర్మ, విక్రమాదిత్య చక్రవర్తి వియ్యమందబోతున్నారన్న శుభవార్త కళ్యాణ నగరంలో అంతటా మారుమోగింది. ★

# మారిన మతలబు

కుమారి అనూరాధ

అవి నేను కొత్తగా కాపురానికి వచ్చిన రోజులు. మధురాతి మధురమైన ఆరోజులలో ఏదో కొత్త ఆనందం, ఉత్సాహం!

మావారు మద్రాసులో ఉద్యోగం చేస్తున్నారనే సరికి, ఆమహాపట్నంలో కొత్త కాపురం ఎలా వెలిగించబోతానో అని విచారించానొకక్షణం. అప్పుడే వారిదగ్గరనుంచి వుత్తరంవచ్చి రెండు రోజులైంది. భావిజీవితమధుర ఘట్టాల నూహించుకుంటూ ఊహాలోకంలో విహరిస్తున్న నన్ను "ఏమే అమ్మాయ్, బావ లా వుంటాడోనని వూహించుకుంటున్నావా లేక నీవంట రుచి చూచి యేమంటాడోనని అనుకుంటున్నావా? ఫర్వాలేదులే. మా చెల్లాయికి చదువులో బి. ఏ ప్యాసయినా వంటలో ఏ పరీక్షా కాలేదని ముందే బావకు విన్నవించుకుంటాలే" అని మధ్య మధ్య నా వంట రుచి చూచిన మా అన్నయ్య ఉడికించేవాడు.

ఒంటరిగా కూర్చుంటే ఆలోచనలు కూడా పెరిగిపోతున్నై. వారికి అరవం బాగా తెలిసే వుండివుంటుంది. లేకపోతే ఇంగ్లీషు తెలియని పనివాళ్ళతో యేలా వేగుతున్నారు? అవును తప్పకుండా తెలిసి వుండాలి తమిళం! వెళ్ళినప్పటినుంచీ నా సంగతీ వారే చూడాలేమో...

"అమ్మాయి అరవలోకంలో పడబోతుంది ఇక బావకు అమ్మాయి సంగతి చూడడమే నేమోపని" నలుగురిలో అన్నయ్య చేసిన రిమార్కుకు అంతా గొల్లుమన్నారు.

"నెగ్గుకోవడమేం బ్రహ్మాండమా?" అని వెంటనే రిటార్టు ఇచ్చాను.

"ఓహో, ఇంక తిరుగులేదు. ఎప్పుడైనా మనం వెళ్ళితే తెలుగులో మాట్లాడే పనేలేదు. అంతా తమిళంలోనే"...

కొద్ది రోజులనుంచీ యేమిటో అందరూ నన్ను ఎగతాళి పట్టేస్తున్నారు. మధ్య మధ్య చిరాకు, ఛలోక్తులలోని వాత్సల్యం నా మనస్సును పంచుకుంటున్నై. ఏ ఆడదైనా ఎల్లకాలం తల్లిదగ్గరకు పోకుండా వుంటుందా? ఎందుకబ్బా నన్ను యింత ఎగతాళి పట్టిసాగు...అది సహజం అందులో ఓక అంశం లేకపోలేదు. తిరిగి జీవితంలో యీఘట్టం అనుభవిస్తామా! లేదు అయితే యువతులంతా ఎప్పుడో ఒకప్పుడు పరిహాసానికి గురికావలసిందేనన్నమాట... ఆలోచనలు సాగిపోతున్నై. నాలో నాకే ఒకవిధమైన మార్పువచ్చినట్లనిపించింది. ఏవో బాధ్యతలు తలపై పడినదానిలా ప్రవర్తిస్తున్నా...

ఆరోజు 8 గంటల మెయిలుకే వారు వచ్చారు ఇల్లంతా దీపకాంతులతో పిల్లాజెల్లా కేరింతలతో కళకళలాడుతూవుంది. అన్నయ్య, వారు సోఫాలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఎంతో కుతూహలంగా వారుచెప్పేది విందామంటే మధ్య మధ్య పిల్లలగొడవతో సరిగా వినిపించనేలేదు.

"మీ అమ్మాయికోసమేనోయ్, తెలుగు వాళ్ళు ఇరుగుపొరుగుల్లో యిల్లుకుదిర్చాను. కాని ప్రక్క రెండుయిళ్ళవాళ్లు మాత్రం అరవలే చాలమంచివాళ్లు! నా స్నేహితులుకూడాను" అన్నమావారి మాటలకు నాకు నవ్వొచ్చింది నేనంత పిరికిదాన్ననుకున్నారేమో కొత్తభాషకు భయపడడానికి.

* * *

"ఇంకా సర్దడంలో నేవున్నావా శశీ! త్వరగా కానివ్వాలిసుమా! రాత్రి మెయిలుకు తప్పకుండా వెళ్ళాలి. రేపు సెలవు లేదని చెప్పానుకదూ! టిక్కెట్టు కూడా బుక్ చేసుకొచ్చాను." కూనిరాగాలు తీస్తూ ఆలోచిస్తూ ముచ్చటగా సర్దుతున్న నాదగ్గరకు వారెప్పుడువచ్చారో గాని, ఆమాటలనేసరికి నాకు సిగ్గేసింది.

తల్లిదండ్రుల్ని వదలివెళ్తున్నాననే ఒక బాధ. సుఖప్రదమైన జీవితయాత్ర సాగింపవెళ్తున్నాననే ఒక ఆనందం మనస్సులో పెనగొనడంతో ఆపూట భోజనం సరిగా రుచించనేలేదు అదేమి విచిత్రమోకాని నాలాగే అంతా అట్లాగే భోజనం చేసినట్లుంది తల్లిబిడ్డలమధ్య మిథ్యాప్రపంచంలో యెంత సంబంధం పెనవేసుకునివుంది! అయినా యేనాటికైనా ఆడపిల్ల పరాయియింటికి వెళ్ళవలసిందేగా? ఆవిషయం తెలియకేనా లోకంలో అందరు తల్లిదండ్రులు తమపిల్లలను అత్తవారింటికి పంపేటప్పుడు విచారిస్తారు!......చాలాసేపటినుంచి నాతో అమ్మ చెబుతున్నమాటలలో ఒక్కటీ నాబుర్రకెక్కలేదు.

నా సామానంత మా కారులో —[మన్నగారి కారులో] పెట్టి డ్రైవరు రెడీగా వున్నదని గోల చేస్తున్నాడు. వెంటనే మేమిద్దరం కారులో కూర్చున్నాము. కదలబోతున్న కారుదగ్గర కొచ్చి నుంచున్న అమ్మా, నాన్నా ఆనందాశ్రువుల రాల్చారు. నాకు అప్రయత్నంగా కన్నీళ్లు తిరిగాయి నోట్లోంచి మాటరాలేదు. కంఠం రుద్ధమైపోయింది. అతికష్టంమీద "వెళ్లొస్తానమ్మా"అనగలిగాను

రాత్రంతా రైలులో యేవిధంగా గడచిపోయిందో, చాల బడలికగా వుంది. మేము యిల్లుచేరేసరికి టిఫినుకారియరు రెడీగా వుంది. ఈ యేర్పాట్లన్నీ అదివరకే చేసి వుంచారేమో! భోజనాలయా... నాముందు ఓ మోపెడు మాగజైను పడవేస్తూ "చదువుకుంటూ పడుకో శశీ! ప్రయాణ బడలిక తీరుతుంది. సాయంత్రం నేను తిరిగి వచ్చేవరకు ఏ పనీ చేయకూడదు తెలిసిందా?" అని వెళ్ళిపోయారు వారు ఆఫీసుకు.

వారలా వెళ్ళి అయిదు నిముషాలయిందో లేదో యింతలోనే "శేషూ" అని మావారి పేరుపెట్టి ఎవరో పిలిచారు ఏదో మాగజైనుచూస్తూ "లేరు, యిప్పుడే అలా బయటకు వెళ్ళారు," అని సందేహించకుండా సమాధానం చెప్పాను. ఆ మహానుభావుడు "ఎంగపోచ్చి" అని నాలుగైదుసార్లు అడిగాడు. ఆ భాషకు అర్థం తెలియక తల్లక్రిందులయాను. అతనికి యేలా తెలియజేయాలో అర్థంకాలేదు. ముచ్చెమటలు పోసినాయి.

ఎలాగో తమాయించుకుని ఇంగ్లీషులో "హీ హేజ్ బీన్ టు ది ఆఫీస్ సర్" అని సమాధానం చెప్పాను. అప్పటికి అర్థమై ఆ వ్యక్తి థాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు. ఎక్కువ తికమకలలో పెట్టకుండా రక్షించిన యింగ్లీషును మెచ్చుకుంటూ యీజీ చైర్ లో నడుంవాల్చాను.

ఎప్పుడు నిద్రపట్టిందో యేమో కళ్లు తెరచేసరికి గడియారం మూడుగంటలు కొట్టింది. ఇంతలోనే తలుపు కొట్టిన శబ్దం వినవచ్చింది. ఇందాకటిలా మళ్ళా ఎవరైనా వారికోసం వచ్చారేమోనని తమాయిస్తూనే తలుపుతీశా ప్రొద్దున కారియరు తెచ్చిన వత్రవాడే "అయ్యగారు టిఫినుపంపారు.

 

# మారిన మతలబు



తిరిగి వెంటనే రమ్మన్నారు" అని ఒక్క నిముషమైనా నిలవకుండా వెళ్ళిపోయాడు వాడెవరో తెలుగువాడే అయివుంటాడు. లేకపోతే అంత చక్కగా ధారాళంగా మాట్లాడలేడు.

ప్రక్కయింటో ఏదో గోలగా వున్నట్లుండడంవల్ల యిలంతా కలయజూస్తున్న నాకు అటు చూడాలనిపించింది పైకివెళ్ళి కిటికీగుండా చూచాను. బొద్దుగా, నల్లగా, గూడకట్టుకట్టి పొట్టిచొక్కాలు ధరించిన యిద్దరు వ్యక్తులు పెద్దగా అరుచుకుంటున్నారు. వాళ్ళ ముఖకవళికలు, చేతుల అభినయం చూస్తే కొట్టుకొనే పరిస్థితులేర్పడేటట్లున్నాయి స్వచ్ఛమైన అరవం దొర్లించేస్తున్నారు వారిద్దరూను

ఆ సమయంలో నాకెందుకో వారుచేసే శబ్దానికీ, డబ్బాలో రాళ్లుపోసి గలగల మోగిస్తే వచ్చేమోతకు పోలిక కనుపించింది. కొంతసేపయాక యిద్దరూ నవ్వుకుంటూ వెళ్లిపోయారు. నాకు అప్పుడు తెలిసింది అసలు సంగతి. వాళ్లు పోట్లాడుకోవడంలేదు, మాట్లాడుకుంటున్నారని.

నిట్టూరుస్తూ క్రిందికి దిగుతున్నానే కాని వాళ్ల మాటలింకా నా చెవుల్లో రింగుమంటున్నాయి కిటికీ ప్రక్కగా కుర్చీలో కూర్చుని బయటకు చూస్తూ ఆలోచనలు కొనసాగిస్తున్నాను. అంతలోనే బయటి గేటు కిర్రుమని శబ్దంచేసింది. అటు చూద్దునుకదా ఒక పనిమనిషి లోపలకు వస్తోంది. వేషం వేరుగా వుండేసరికి కొంచెం అప్పుడే అనుమానించా ఆమె అరవంలో తప్ప మాట్లాడదని.

"ఉంగళ్ కనవన్ ఎన్నై ఇంగె అళైత్తార్. అవర్ ఉంగె ఇరిక్కిండారా?" అని మొదలు పెట్టింది.

[మీ భర్త నన్ను యిక్కడకు రమ్మన్నారు. ఇప్పుడు వారున్నారా.]

అర్థం తెలియలేదన్నట్లు చెయ్యి ఓ అరగంట వూపిన తర్వాతగాని నాఅవస్థ ఆమెకు అంతుపటలేదు. తర్వాత వస్తానన్నట్లు వెళ్ళిపోయింది తాత్కాలికంగా.

అరవం అర్థంకాక-తల దిమ్మెక్కిపోయింది. అన్ని రకాల బాధలు అనరించినా తెలియని భాషతో సతమతమవడం కష్టమనిపించింది. ఇక నిక్కడ తెలుగు మాట్లాడేవారలేరా అనిపించింది.

అదే సమయంలో ప్రక్కయింటివారిది కాబోలు ఆవు అంబా అని అరచింది. వెంటనే నాకు ఆప్తులు పిలచినట్లనిపించింది. మనస్సు కొద్దిగా తేలికయింది. కాసేపు ఆ శబ్దం వచ్చినవైపు చూచాను. అరవ ఆవులు కూడా తెలుగులోనే అరుస్తున్నాయనుకున్నాను.

"అమ్మాయి అరవలోకంలో పడుతోంది" అన్నయ్య రిమార్కు వెంటనే గుర్తొచ్చింది. ఒక్కరోజులోనే ప్రాణం విసిగిపోయినట్లుంది. ఎంతకూ ఏ గంటలు కాదు. వారు ఎప్పుడు వస్తారోనని ఆశతో కూర్చుంటే నాతో పంతం వేసి ప్రొద్దుకూడ నిలబడి పోయినట్లుంది.

తలుపు చప్పుడు యింటివైపుకు మళ్లిన బుద్ధిని మేల్కొలిపింది. వెంటనే ఎగిరి గంతేసి తలుపు తీశాను "వచ్చారా! అబ్బ యింత ఆలస్యం చేశారేం. నాకసలే దిగులుగా వుంది..." చెప్పేది సాంతం కానివ్వకుండానే "ఏం అమ్మను చూడాలని వుందా..." అని నవ్వడం సాగించారు. "ఎవ్వరినీ చూడాలని కాదు, చూడలేదని

(56 వ పేజీ చూడండి)

# మహాకవి సింహాసనము

## ప్రాచీన గాథాలహరి

కాళిదాస మహాకవి రాజప్రాసాద 'సింహ ద్వారంలో అడుగుపెట్టిన వార్త వినగానే విక్రమాదిత్య చక్రవర్తి స్వయంగా ప్రాసాద సింహద్వారందాకా నడిచివెళ్ళి మహాకవిని సగౌరవంగా తన రహస్య మంత్రాగారంలోనికి తోడుకుపోయాడు. మంత్రాగారంలో ప్రవేశిస్తూనే, తనసరసనే స్వర్ణసింహాసనం మీద కూర్చోబెట్టుకున్నాడు.

కవి మొట్టమొదట చక్రవర్తి సింహాసనంమీద కూర్చోడానికంతగా ఇష్టపడలేదు. అపార్శ్వంలోనే ఉన్న మరిఒక సింహాసనంమీద కూర్చోబోయాడు. కాని చక్రవర్తి దానికంగీకరించలేదు. ఎంతో బలవంతం చేసి కవిని తన సరసనే కూర్చోబెట్టుకున్నాడు:

"మీకు నాసరసన కూర్చోవడానికి మనస్కరించకపోతే పోనీ నేనే ఆసింహాసనం మీద కూర్చుంటాను!"

అని వ్యంగ్యంగా చమత్కరించి ఆపక్కనున్న మరి ఒక సింహాసనం మీద కూర్చోబోయాడు.

"ఎంతమాట!"

అన్నట్టుగా కాళిదాసకవి ఆశ్చర్యపడి చక్రవర్తినే బలవంతంగా తన సరసన కూర్చోబెట్టుకున్నాడు.

వెంటనే వారికనతిదూరంలో ఒయ్యారంగా నిలబడిన తాంబూల కరండవాహిని కవిచక్రవర్తికీ, చక్రవర్తికీ కర్పూర తాంబూలాలందించింది. వారికిరుపార్శ్వాల లోను నిలబడిన చామరగ్రాహిణు లిద్దరు కదలీకదలనట్టుగా వింజామరలు వీచారు. ఆ వింజామరల కదలికలలో కాళిదాసకవి భుజంపై వేలాడే ఉత్తరీయాంచలం అలవోకగా జీరాడింది.

విక్రమాదిత్య చక్రవర్తి ఏదో ఇష్టాగోష్ఠి ప్రసంగం ప్రారంభించాడు. మహాకవి మధ్య మధ్యన ఛలోక్తులలో చక్రవర్తి కుల్లాసం కలిగిస్తూ తాంబూలసేవ కుపక్రమించాడు.

చక్రవర్తి ఆప్యాయంగా ఆదరించి గౌరవించడం మహాకవికి క్రొత్తకాదు. అయితే ఈనాడీ విధంగా గౌరవించడంలో కవిలోక చూడామణి అత్యాదరం గోచరించింది.

వారిద్దరి ఇష్టాగోష్ఠి కొంతకాలం అలాగలాగ అనేక విషయాలమీదికి సాగిపోయింది.

అంతలో పరిసరోద్యానంలో ఒక కోయిల పిలుపు వినిపించింది. చక్రవర్తి ఇష్టాగోష్ఠి ప్రసంగం అత్యాసక్తితో ఆలకిస్తున్న మహాకవి హృదయం అప్రయత్నంగా పరిసరోద్యానవనం వైపు తిరిగింది.

అపరాహ్ణంకాలంలో పిల తెమ్మెరలలో చెలరేగిన పండుటాకులు కొన్ని నెమ్మదిగా గలగలలాడుతూ గిరగిరా తిరిగాయి. మామిడి పూత పుప్పొడి రాలినట్లు జలజల రాలింది. దూరం దూరంగా ఉజ్జయినీ నగరం ఒరుసుకొని ప్రవహించే శిప్రాతరంగాల రొద తుమ్మెదబారుల రొదలో లీనమై సన్న సన్నంగా వినిపించింది.

మహాకవి మనస్సాకింత అన్యాసక్తంగా ఉన్నదని గ్రహించిన చక్రవర్తి కాళిదాస కవికింకా దగ్గరగా జరిగి కూర్చుని తిరిగీ తన ప్రసంగం ప్రారంభించాడు.

వారిద్దరు ఏదో రహస్య ప్రసంగంలోనికి దిగారని గ్రహించి తాంబూల కరండవాహిని తనచేతినున్న తాంబూల కరండకం వారి సమీపంలో ఉంచి అభ్యంతర మందిరంలోనికి వెళ్ళిపోయింది. అది చూచి చామరగ్రాహిణు లిద్దరుకూడా ఆమె వెంట వెంటనే లోపలికి వెళ్ళిపోయారు. అంతలో మంత్రాగారంలో అంతటా అగరుధూమ మాలికలల్లిబిల్లిగా అలుకొన్నాయి.

౨

మరి కొంతిసేపటికి వారిద్దరి ప్రసంగం క్రమక్రమంగా కుంతల దేశాధిపతి విజయేశ్వరవర్మ వైపు తిరిగింది:

"ఈ విజయేశ్వరవర్మ విషయం ఏం చేయమే చెయ్యడానికీ పాలుపోకుండా ఉంది." అన్నాడు చక్రవర్తి.

"మహామాత్యుల నొక్కమారు రాయనదగ్గరకు రాయబారం పంపిస్తేనో?"

అన్నాడు కాళిదాసకవి పిమ్మట చక్రవర్తి అభిప్రాయం తెలుసుకోవాలనే కుతూహలంతో అలాగే నిశ్చలంగా విక్రమాదిత్యుని వైపు చూచాడు:

"ఇది మహామాత్యులవల్ల సాధ్యపడకపోవడంవల్లనే నేనింతగా మథనపడుతున్నాను."

"మరి గత్యంతరం?" అన్నట్లు కవి బొమముడి విరిచాడు. చక్రవర్తి దానికి సమాధానం ఇచ్చాడు:

"కుంతల దేశం మన శత్రుమండలానికత్యంత సన్నిహితమైన రాజ్యం. అదీ గాక కుంతలాధిపతి మనయెడల వైముఖ్యం అవలంబిస్తున్నటు మహామాత్యులు నిరూపిస్తున్నారు. ఈ సందర్భంలో దానభేద దండోపాయాలు ప్రయోగిస్తే అతనికిమనయెడల మరింత వైముఖ్యం ఏర్పడవచ్చును. అది మన శత్రుమండలానికి మరింత దోహదకారి కావచ్చును ఈ సందర్భంలో మన సామ్రాజ్య సుస్థిరతకు కుంతలేశ్వరునితో మైత్రీ బాంధవ్యాలత్యంత ముఖ్యమైనవి అవి కేవలం సామోపాయం మూలంగానే సాధ్యాలు"

అని చక్రవర్తి ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు. కవికా ప్రసంగంతో ఆ విషయం అంతా అవగతమై పోయింది. కొంచెంసేపు మౌనం అవలంబించి మాచాయగా ప్రశ్నించాడు:

"కుంతలాధిపతి దగ్గర యుక్తవయస్కురాలు, రూపవతి అయినటువంటి ఒక చక్కని కన్యక ఉన్నదని విన్నానే."

"అవును. నిజమే."

"ఆమె మన యువరాజ కుమారుని కన్నివిధాలా తగిన కన్యకేగదా!"

"అవును, నా అభిప్రాయమున్నూ అదే!... అయితే కుంతలాధిపతికీ, మనకు మధ్యన ఏర్పడిన వైముఖ్యమే దీని కొక పెద్ద అవ

[illegible]

# ★ మహాకవి సింహాసనం ★

కోపంగా ఉంది...మీరు కొంచెం శ్రమ తీసుకుంటే—"

అని చక్రవర్తి తన ప్రసంగం అంతటితో ముగించివేశాడు. కవి కొంచెం ఆలోచించాడు:

"పోనీ మిగిలిన అమాత్యు లెవరయినా ఈ విషయంలో దౌత్యం నిర్వహిస్తే-"

అని తనఅభిప్రాయిం కొంచెం సందిగ్ధంగా వ్యక్తీకరించాడు.

"మహామాత్యులే సాధింపలేనప్పుడిక ఇతరమాత్యులవల్ల ఏమవుతుంది!...అయినా ఈ కుంతలేశ్వర దౌత్యం మీకంతగా రుచించనట్టుందే!"

అని చక్రవర్తి ఒక్క చిరునవ్వు చిలకరించాడు:

"మీపరిచయం భాగ్యం కలిగిన అనంతరం ఇతరరాజన్యులతో గోష్ఠీ ప్రసక్తి అంటే నాకంతగా రుచించనిమాట వాస్తవమే అన్నాడు కవి." చక్రవర్తి చిరునవ్వింకా చెక్కుచెదరకుండా విస్తరించింది:

"విజయేశ్వరవర్మ విషయం మీకంతగా సుపరిచితం కాదేమో! ఆయన కేవలం విద్వన్మణి!"

మహాకవి దానికేమి ప్రత్యుత్తరం ఈయలేదు.

"స్వయంగాకవి. పైగా కవితాప్రియుడు. అదిన్నీగాక ఆయన మీ విఖ్యాతి విని మిమ్మల్ని సందర్శించవలెనని కుతూహల పడుతున్నాడనికూడా విన్నాను. ఈకారణాలన్నిటివల్ల తామే ఇది నిర్వహించవలెనని నాప్రార్థన."

కాళిదాస కవికిప్పుడు విక్రమాదిత్యుని హృద్గతాభిప్రాయం విస్పష్టంగా అవగాహన అయింది చక్రవర్తి కుంతలేశ్వరునితో మైత్రీబాంధవ్యాలభిలషిస్తున్నాడు.అయితే ప్రస్తుతం కుంతలదేశాధిపతి విజయయేశ్వర వర్మ శత్రుమండలితో సంబంధ బాంధవ్యాలభివృద్ధి పొందించుకోవాలని ప్రయత్నాలు చేస్తున్నాడు. విక్రమాదిత్య చక్రవర్తి అది అరికట్టాలని సంకల్పించాడు. ఆ సంబంధ బాంధవ్యాలు తనతో కలుపుకోవాలని అభిలషిస్తున్నాడు.కుంతలాధిపతి కుమార్తెను తనకుమారునికిచ్చి వివాహం చేస్తే అదిబాగా సుగమం కాగలదని నిశ్చయించాడు. దానికి కుంతలేశ్వర దౌత్యం నెరపవలసినదని స్వయంగా అభ్యరిస్తున్నాడు.

కాళిదాసకవికా అభ్యర్థన కాదనడానికి మనసొప్పలేదు. విక్రమాదిత్య చక్రవర్తి అంతటి వ్యక్తి స్వయంగా అభ్యర్థించినప్పుడిక కాదనడం సముచితం కాజాలదు. అందుచేత కవి కుంతలేశ్వర దౌత్యం నెరపవలెననే నిశ్చయించాడు. కాని తన అంగీకారం వెనువెంటనే చక్రవర్తికి తెలియజెయ్యలేదు. చక్రవర్తి అది గ్రహించాడు:

"మీ కేదో కొంచెం సంశయిస్తున్నట్టున్నారు. స్వయంగా నా ప్రతినిధిగా మీరీ కుంతలేశ్వర దౌత్యం నెరపుతున్నప్పుడాయన చక్రవర్తి సముచితమైన గౌరవాదరాలతో మీ అడుగులకు మడుగులొత్తవలిసిందే!"

"నేను నాగౌరవాదరాల విషయంకాదు ఆలోచించేది." అన్నాడు కవి.

చక్రవర్తి జిజ్ఞాసార్థకంగా బొమముడి విరిచాడు.

"నా అధికార పటాటోపం చూచి ఆయన మరింత బిగువులు పోతాడేమోనని నాభయం!"

అని కవి తిరిగీ ఆలోచనలో పడ్డాడు. చక్రవర్తికి క్షణకాల మేమీ పాలుపోలేదు.

కవి తిరిగీ తన అభిప్రాయం కొంచెం చూచాయగా తెలియజేశాడు:

"నేను కేవలం కవిమాత్రుడుగానే కుంతలేశ్వరాస్థానం సందర్శిస్తే?"

ఆ ఊహ చక్రవర్తికి బాగా నచ్చింది: "అవునవును. ప్రస్తుతాని కదే సముచితమైన మార్గం మీరు కవి చక్రవర్తులు! మా సామ్రాజ్యం పరిమితం. మాది నిరవధికమైన కవితా సామ్రాజ్యం ఎలాంటి మకుటాధిపతులైనా మీకు సామంతులే!"

అంతమాత్రంచేత కాళిదాసకవి ఉబ్బి తబ్బిబ్బైపోలేదు ఒక్కసారుగా కలకల నవ్వాడు:

"అమకుటాధిపతులు రసజ్ఞులైనప్పుడే గదా మా ప్రాభావం!"

"కుంతలాధిపతి మాకు సామంతు లనిపించుకోవ డానికి కొంచెం వెనకాడుతున్నారు. కాని మీ ప్రాభవం కుంతలాలలో కూడా అవ్యాహతంగా చెల్లుబడి కాగలదు. దిగ్విజయీభవ!"

అన్నాడు చక్రవర్తి సౌహార్దం ఒలకబోస్తూ. దేశనామధేయాలు బహువచనాంతంగా ప్రయోగించడం గీర్వాణ సంప్రదాయం. అది గ్రహించి 'కుంతలాలలో' అనేపదంపై చమత్కరించాడు కాళిదాస మహాకవి:

"ఇంతవరకు మా సామ్రాజ్యం సుందరీమణుల మూర్ధకుంతలాలవరకే వ్యాపించింది. మీ శుభాశంసవల్ల అది కుంతలదేశ సుందరీమణుల మూర్ధకుంతలాల వరకు విస్తరించగలదేమో!"

ఆ చమత్కారంతో చకితుడైన చక్రవర్తి మహాకవిని సాదరంగా కౌగలించుకొని సగౌరవంగా రాజప్రాసాద సింహద్వారం వరకు సాగనంపాడు.

కాలేజీ కూడ మానేసి ఇంట్లో లంఖణంతో పడుకున్నాడు.

"ఏమిరా మూర్తి ఈ మధ్య నువ్వు చాల నీరసించి పోతున్నావు," అంటూ వచ్చాడు విఠల్.

"ఏం చెప్పనురా బ్రదర్, ఆ అమ్మాయి నిజంగా నన్ను ప్రేమిస్తోందో, లేదో తెలియటంలేదు. నాకేసి చూసి ఆమధ్య నవ్వేది కూడాను. నాల్గు రోజులుబట్టి అసలు కనిపించడం లేదు! ఏదైనా ఉపాయం చెప్పరా," అని దీనంగా ఆలాపించేడు మూర్తి.

"అది సరే, ఆ అమ్మాయి కనిపిస్తే, నీతో మాట్లాడితే, నిన్ను ప్రేమిస్తే, నువ్వు ఏం చేస్తావు"?

"అదేమిట్రా పిచ్చి ప్రశ్న. ప్రేమిస్తాం! లాలిస్తాం! పూజిస్తాం!"

"బీచ్‌లకు తీసుకెడతావు, పాడు చేస్తావ్! పొమ్మంటావు! అంతేనా?"

"ఎందుకు పొమ్మంటానురా!"

"అయితే మూర్తీ, పెళ్ళి ప్రయత్నం చేస్తే మంచిది. వాళ్లకీ బరువు తగ్గుతుంది, నీకూ బాధ తీరుతుంది."

"పెళ్ళికి మావాళ్లు ఒప్పుకోకపోతే...."

సందేహంగా అన్నాడు మూర్తి.

"అందుకే మన మగజాతిని మూర్ఖులు, పశువులు అన్నారు. నోరు మూసుకొని ఆ గొడవ వదిలేయి. పెళ్లి చేసుకోడానికి వాళ్ల వాళ్లు ఒప్పుకోరుట, పూజించటానికి, ప్రేమించటానికి ఒప్పుకుంటారుట," అన్నాడు కఠినంగా విఠల్.

"అదికాదురా, మా మేనమామ కూతురొకర్తె ఉందిరా నా ప్రాణానికి."

"సరే ఆ అమ్మాయినే చేసుకో, ఇంక నీకీ బుద్ధులెందుకు?"

మూర్తి కొంచం ఆలోచించి, "ఒరే విఠల్ నేను పెళ్ళి చేసుకోడానికేనా సిద్ధమేరా!"

"అలా అయితే నే చెప్పినట్లు చెయ్యి." అంటూ మూర్తి చెవులో ఏదో రహస్యంగా చెప్పేడు విఠల్.

* * *

ఆ రోజు పూమాలకంటే ఒక పావుగంట ముందే వచ్చేడు మూర్తి కాలేజీ డాబాదగ్గరకు. పూమాల కాలేజీనుంచి వస్తూ గుమ్మం ముందున్న గులాబీ పువ్వును చూసింది. ఇది ఇక్కడికెలా వచ్చింది? అనుకొని తీసింది. అందు మడిచి ఉంచిన ఉత్తరం కనిపించింది.

పూమాల హుషారుగా డాబామీదకు పోయింది ఉత్తరం చదువుకుందికి. ఓహో ఇతను ఎమ్ ఏ చదువుతున్నాడా, పాపం నేను ఊరికెళ్ళినట్లు ఇతనికి తెలియదు కాబోలు! అనుకుంది. ఇంతలో మూర్తి నవ్వుతూ కనిపించేడు క్రింద సోడాకొట్టు దగర. గబగబా ఒక చిన్న ఉత్తరం వ్రాసి తన జడలోని చామంతి పువ్వుకు కట్టి క్రిందకు విసిరింది. మూర్తి ఆనందానికి అంతులేదు గబగబా లేఖ విప్పి చూశాడు.

"ప్రియమైన మూర్తిగార్కి, మీ లేఖ చూశాను చాలా సంతోషం. మీ ప్రేమకు నేను యే విధంగా కృతజ్ఞత తెల్పాలో అర్థం కావటంలేదు. రేపు సాయంకాలం, అయిదు గంటలకు బీచికొస్తే విషయాలన్నీ

సవిస్తరముగా మాట్లాడుకోవచ్చు," అని వుంది.

ఆ మర్నాడు:

"గుడ్ ఈవినింగ్ మిస్టర్ మూర్తి."

బీచ్‌లో తనకోసం నిరీక్షిస్తున్న మూర్తి ప్రక్కన కూర్చుంది పూమాల

"గుడ్ ఈవినింగ్ మిస్ మాల."

"ఇదుగో చూడండి మూర్తిగారు, నన్ను మీరు ఇంత హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నారని నేను ఇంతకాలం గమనించనే లేదు. మీరు ఇంత త్యాగపురుషులని తెలియదు. సరేగాని మిస్టర్ మూర్తి సాధారణంగా మగవార్ని నమ్మకూడ దంటారు! కాని నేను మిమ్మల్ని విశ్వసిస్తున్నాను. మీరు నన్ను ప్రేమిస్తున్నానని వ్రాశారు. చాలా సంతోషం నాలో దేన్ని ప్రేమిస్తున్నారు మీరు? హృదయాన్నా? గుణాన్నా; అందాన్నా?"

"హృదయాన్ని" టక్కుని సమాధానం చెప్పేడు మూర్తి.

'ఈ కొద్ది రోజుల్లోనే నా హృదయాన్ని తెల్సుకొన్న మీరు పూజనీయులు," అంది ఎగతాళిగా నవ్వుతూ.

"మీ గుణాన్ని" అన్నాడు మూర్తి కొంచం బెదురుగా.

"ఓహో, నా గుణాన్ని మీరు అప్పుడే గమనించేరా?"

"అహఁ, కాదు, కాదు, మీ అందాన్ని" అన్నాడు తడబడుతూ, మూర్తి; ప్లేటు మూడవసారి మారుస్తూ.

"ఈ అందం కొంత కాలానికి నశిస్తే"

మూర్తి నిర్ఘాంత పోతున్నాడు. ఇంతవరకూ ఏ ఆడదీ తనతో అలా మాట్లాడింది లేదు.

"మాలా, నీ ప్రశ్నలకు నేను సమాధానం చెప్పడానికి తగను నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నీ కిష్టమైతే వివాహం చేసుకోడానికి కూడా యేమీ అభ్యంతరం లేదు. రేపు వేసవి శెలవుల్లో నువ్వుకూడ నాతోపాటు వస్తే మా వాళ్ళకు చూపెట్టి నచ్చచెబుతాను. ఈలోగా మీ తల్లిదండ్రులతో మాట్లాడమంటే ఇక్కడ నేనే మాటలాడతా," అని దీనంగా ముగించేడు మూర్తి.

"ఇక్కడ ఎవరితోటీ ఏమీ చెప్పక్కర లేదు ఇది మాపిన తల్లి గారి ఇల్లు నేను మీ కంటే పైకి వెళ్ళాలి కాబట్టి, మీఊర్లో దిగి మాటలాడిన తరువాత ఇద్దరం మా ఊరు వెడదాం నేను ఇలా అంటున్నానని కోపమా మిష్టర్ మూర్తీ?"

"అబ్బే, లేదు. సరే... అలాగే చేద్దాం."

* * * *

పూమాల, మూర్తితో బాటు రైల్లో కూర్చోడానికి ఇష్టపడక, తను ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కింది. రాజమండ్రీ వచ్చే సరికి మేకప్ చేసుకొని చాల టిప్‌టాప్‌గా తయారైంది

రాజారావుగారు కొడుకును ఆ అమ్మాయిని చూసి నిర్ఘాంతపోయారు! ఎవరు ఈ అమ్మాయి అన్నట్లు "ఓ సేవ్ తాయారు, అబ్బాయొచ్చేడే", అన్నాడు.

తాయారమ్మ గబగబా వచ్చింది. "ఎవరురా ఈ రెండుజడల బర్రిని వెంటబెట్టుకు వచ్చేవు?" అందితల్లి. "ఈమె పేరు పూమాల నీ కోడలమ్మ", అన్నాడు గర్వంగా మూర్తి.

"ఏశిపినశే ఉంది, ఎవర్తెనో తీసుకొచ్చి కోడలంటావేమిటి"? కఠినంగా అన్నారు రాజారావుగారు.

"ఈ అమ్మాయిని నేను ప్రేమించేను. ఈమెను తప్ప నేను ఇంకెవర్నీ పెండిచేసుకోను."

"లక్షణంగా మామయ్య కూతురుండగా, ఇది ఎవర్తెరా అలిప్‌స్టిక్, అడీసీ!" అంది తాయారమ్మ ఎగతాళిగా.

"అమ్మా ఇది నా ఇష్టం. మీ వెర్రిబాగుల మేనగోడలు నాకు అక్కరలేదని ఇదివరకే చెప్పేను."

నిర్మల ఏమీ మాట్లాడకుండా పకాపకా నవ్వుతుంది. "ఎందుకే అలానవ్వుతావు? అర్థంలేకుండాను?" అంది తాయారమ్మ కోపంగా.

ఇంతలో వెంకటప్పయ్యగారు భార్యా సమేతంగా దిగేరు. "ఏమోయ్ మూర్తీ, మా పులమ్మ నీకెక్కడ కలిసిందోయ్"? "మీ పుల్లమ్మ ఏంకాదు. ఈమె పేరు పూమాల. బి. ఎ. చదువుతూంది మెడ్రాస్‌లో," అన్నాడు మూర్తి. "అన్నయ్యా పులమ్మ ఒదినే," నిర్మల నవ్వాపుకోలేకపోయింది.

మూర్తికేమీ అర్థంకావడం లేదు. అంతా అయోమయంగా ఉంది. ఒక్కసారి కళ్లు నులుపుకొని మళ్ళీ చూశాడు పూమాలకేసి. నిర్మల సబ్బునీళ్లు ఇచ్చింది, అన్నయ్యను ముఖం శుభ్రంగా తోముకొని మరీ చూడమన్నట్లు.

మూర్తి సిగ్గుపడిపోయాడు. కొండను తవ్వి ఎలకను పట్టినట్లు తిరిగి తను పుల్లమ్మనే ప్రేమించినందుకు అమాయకంగా నవ్వుకున్నాడు.

నిర్మల తనకూ ఒదినకూ మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల విషయం, అన్నయ్య వేషానికి లొంగిపోయి, అనేకపాట్లు పడి మోసపోయిన కథ సావధానంగా తెలియపర్చింది.

అసలు కొండలు దగ్గరవే అయినా, అవి దూరంగా వెళ్లడంతో నునుపయాయి కాబోలు! ★

# మంత్రాలు: నమ్మకాలు

## సేవాపరుడు శ్రీ ఐలూరి అంజయ్య

మీ రెప్పుడైనా మేడూరు గ్రామము వెళ్ళేట్లయితే, మోకాళ్ళపైకి నీర్కావి ధోవతి ధరించి, చేతికర్రతో, ఒంటరిగా నడుస్తూ ఏమైనా స్మరించుకొంటూ కన్పించినవారే శ్రీ ఐలూరు అంజయ్యగారై యుంటారు. వీరు వారమునకు ఒకటి రెండు సార్లు మేడూరు గ్రామము వచ్చి, రైతుల యోగక్షేమములు తెలిసికొనుచు, వారి పశువులు దృష్టి దోషముచే. మేత ముట్టకపోయినా, పాలీయక ఎగవేసినా వాటికి త్రాళు మంత్రించి యిస్తూ ఉంటారు. ఈ గ్రామములో పిల్లలు జడుసుకొన్నా, లేక పాములు దగ్గిరా ఇంట్లో పాకినా వీరిచే మంత్రించబడిన, ఇసుక, విభూతి తీసుకొని, నిశ్చింతిగా ఉంటారు.

అంతేగాక వీరు క్రొత్త తెల్లగుడ్డ పేలికలు ఒక చిన్న పెన్సిలు ముక్కను తమ వెంట నిడుకొని, మనుష్యులకు దురాయి వేయుటకు సదా సిద్ధముగా ఉంటారు. పాముకాట్ల బాధను వీరు నిమిషములలో పోగొట్టగలరు. ఇంకా కొన్ని రోగములు, మంత్ర సంబంధమైన పొక్కుల (చెల్లి మున్నగునవి)నుండికూడ విముక్తి చేయగలరు.

వీరి స్వగ్రామము కృష్ణాతీరమున నున్న ఐలూరు కాని ప్రస్తుతము మధునాపురములో స్థిరనివాస మేర్పరచుకొన్నారు. వీరు అతి నిష్ఠాపరులు. శైవులు, దుర్గోపాసకులు. నవరాత్రుల సమయమున దుర్గకు శాంతిజేయుదురు. మంత్రోపాసకులలో కొందరు దుర్గకు జంతువులను బలులీయుటకూడ గలదట. కాని వీరి కట్టిది గిట్టదు వీరు ఆకులు, పువ్వులతో మాత్రమే పూజింతురు. మంత్రములపై మీ అభిప్రాయమేమని వీరి నడుగగా వ్యాధులు మంత్రములకే కుదురునుగాని, కొన్ని సమయములలో తంత్రముకూడ ఉపయోగపడునందురు. తంత్రమనగా సాంబ్రాణిపొగ వేయుట, కొబ్బరికాయలు కొట్టుట మొదలైనవి. (వ్యాధులనగా మంత్రాలకు కుదిరే వ్యాధులని వీరి అర్థము.)

వీరొకపారి ఐలూరులోని తమ బందుగుల యింటినుండి స్వగ్రామము వచ్చుచు గుడివాడ జేరుసరికి మేడూరుబస్సు వెళ్ళిపోయినది. వీరికచట బంధువు లుండుటచే మధ్యాహ్నము వెళ్ళవచ్చునని ఆ పూటకు ఆగిరి. కొంతసేపటికి ఎక్కడినుండియో కొంతమంది హరిజనులు స్పృహతప్పిన వానినొకని మోసుకొని పోవుచుండిరి. అది యేమిటని వీరడుగగా ఎవ్వరు సమాధాన మివ్వలేదు. తరువాత వానిని చెరువు వద్ద దింపిరి. అప్పుడొకాయన రోగిపై వేపమండలు విసరుచు మంత్రించుచుండెను. అది యేమో చూతమని వీరుకూడ వెళ్ళిరి. రోగి నురుగులు గక్కుచుండెను. పరిస్థితి తెలిసికొని వీరు మంత్రము వేయు ఆయనను ఎంతసేపటికి విషము దిగునని ప్రశ్నించగా ఆయన 'గంటకు' అని చెప్పెను. గంట గడచిన తరువాత వీరు మరల అడిగిరి. ఆయన మరల 'అరగంటకు' అనెను. అరగంట గడచెను గాని రోగిలో మార్పు లేదు. అప్పటికే కాలము మించిపోవుచుండెను. మధ్యాహ్నము 12 గంటలు దాటిన రోగి బ్రదుకుట కష్టము ఆ విషయము గమనించిన వీరు ఆయనను 'మీ వల్ల అగునా కాదా' యని స్పష్టముగా అడిగిరి. ఆయన ఇక తనవల్ల గాదనెను. వెంటనే వీరు చుట్టునున్న జనులను దూరముగా తప్పుకొనమని చెప్పి మంత్రమును కొన్నిసార్లు జపించి నురుగులు గక్కుచున్న రోగిని 'కళ్ళు తెరువ'మని ఆజ్ఞాపించిరి అతడు కళ్ళు తెరచెను. మరల మంత్రమును కొన్నిసార్లు జపించి రోగిని లేచి కూర్చొనుమనిరి. అతడు లేచి కూర్చుండెను. అదే విధముగా నిల్చొమని, నడువుమని అనగా అతడట్లే చేసెను. తరువాత పాముకాటు వేసిన రోగికి రాత్రివరకు భోజనము పెట్టవద్దని, రాత్రికిమాత్రము మజ్జిగతోనో, లేక చారుతోనో మాత్రమే పెట్టమని చెప్పి తమదారిని పోవుటకు బయలుదేరుచుండగా ఆ హరిజనులు వారి కాళ్ళపైబడి తమ కృతజ్ఞత దెల్పుకొనిరి. వారు గనుక రోడ్డువెంట నడుతూంటే బాటనపోయే త్రాచుకూడ ప్రక్కకు తప్పుకొనిపోవును. పాములకు హానిచేయుటకు వీరెన్నడు అంగీకరించరు.

అలాగే మరొకసారి మేడూరులో ఒకనికి గోధుమవన్నె త్రాచు గరచి స్పృహదప్పెను. వెంటనే ఒకడు అంజయ్యగారి కొరకై పరువెత్తెను. మరొకరు రోగిచెవిలో 'ఐలూరు అంజయ్యగారి మంత్రము' అని పదే పదే అనుచుండెను. అంజయ్యగారి కొరకు వెళ్ళినమనిషి వారిని తీసికొని సగము దూరము వచ్చుసరికే, రోగికి తెలివివచ్చి కొందరి సాయముతో నడచుచు వారి కెదురుపడెను. వారి మంత్రశక్తి అంతటిది. చెవిలో అన్నంతమాత్రముననే రోగికి కొంతవరకు స్వస్థత చేకూరినది. తరువాత వారతనికి దురాయి వేయగా పూర్తిగా తగ్గిపోయినది.

ఫోనులో పాముగరచిన విషయము చెప్పి దురాయి నిమ్మని అడిగినను వారు వెంటనే దురాయి చెట్టుకొమ్మకు గట్టెదరు. రోగికి విషము దిగిపోవును. ప్రత్యక్షముగా అయినట్లయితే రోగి తనపేరు,బాధచెప్పి, 'దురాయి యివ్వండి తాతగారూ' అని అడుగవలయును. వారు పేరును, బాధను ఒక తెలగుడ్డ పేలికపై పెన్సిలుతో వ్రాసి దానిని మంత్రించి యిత్తురు. అపుడు రోగిబాధ తగ్గును రోగి స్పృహలో లేకపోయినట్లయిన వాని తరఫున మరొకరు అడుగవచ్చును.

మేడూరులోని ఒక హరిజనునికి కాలుసేతులు ముఖము ఉబ్బిపోగా, డాక్టరు వద్దకు పోవు స్తోమత లేకపోవుటచే అంజయ్యగారి వద్దకుపోయి వరుసగా నాలుగు రోజులు దురాయి వేయించుకొని రోగవిముక్తుడయ్యెను.

చోరగుడిలోని ఒక స్త్రీ అధిక ఋతుస్రావముతో బాధపడుచుండెను. ఆమెను వీరి వద్దకు వెళ్ళుమని ఎవరో సలహా ఈయగా ఒకరోజు వెళ్ళినది. ఆతరు వాత వరుసగా వారమురోజులు దురాయి వేయించుకొని రోగవిముక్త అయినది. కాని రోగములకు దురాయి వేయించుకొన్నవారు శుద్ధిగా నుండవలెను. తమ చుట్టాలలో ఒకామెను, ఇంకొకరో మరొక ఆమెను కూడ ఇటి జబ్బులనే వీరు కుదిర్చిరి. కంఠ

(30-వ పేజీ చూడండి)

# మాంత్రికుడు మాండ్రేక్

కల్పన, రచన:
.... లీ ఫాక్, ఫిల్ డేవిస్ ..













రాం(డేక్....
ోపీకోసం...
....ఇంకా స్త


ఆగోరీమీదేగా నిన్న టోపీచూశాను?....మూసివుందే! అంతా నా భ్రమేనేమో!
ఏంకావాలి మీకు? నేను కాపరిని.
3


గబుక్కున నార్దా ముఖాన పడింది.
అయ్యో!....కళ్లు చీకట్లు కమ్మే....అ.మ్మా....
6-13
YNDICATE, Inc., WORLD RIGHTS RESERVED.


చీకటి మరింత చిక్కబడింది....ఆ రాత్రివేళ, శ్మశానంలో ఇలకోడి కిచకిచలు తప్ప అంతా నిశ్శబ్దం....
4

(ఇంకా ఉంది)

# ★ మంత్రాలు, నమ్మకాలు ★

(27-వ పేజీ తరువాయి)

సర్పిని మంత్రములో కుదుర్చుట వీరికి అతి సామాన్యవిషయము.

వారిప్పటికీ పూర్తి ఆరోగ్యముతో జీవించే ఉన్నారు. ఆయురారోగ్యములతో నూరేళ్లు జీవించి రైతులకు ఇతోధిక సేవ చేయగలరని ఆశిస్తున్నాము.

'ప్రసాద్'—మేదూరు,

* * *

ఆది సాయంత్రం 6-30-7 గంటల మధ్య కాలము అప్పుడుమణిమాణిక్యంనరసింహారావుగారు బందరులోని భాస్కరపురంలో వుంటున్నారు వారి కుమారుని పేరు మణిమాణిక్యం రామనాథ యాజ్ఞవల్క్య. అతడు దొడ్డిలో తిరుగుతూండగా త్రాచుపాము కరచింది. పాము కరవగనే నురుగులు కక్కడం మొదలెట్టినాడు. అప్పటికి నరసింహారావుగారి మిత్రులు డనుకుంటాను వారితో మాట్లాడుతూ వున్నారు అతనిని సైకిల్ ముందర కడ్డీపై కూర్చోబెటి ఆ మిత్రుడు హాస్పిటల్‌కు తీసుకు పోతున్నారు. ఇంతలో పువ్వాడ శేషగిరిరావుగారు భాస్కరపురంలోని తమఇంటికివెళుతున్నారు. హాస్పిటల్‌కు అతనిని తీసుకుపోతుంటే చూచి ఏమిటని అడిగారు పాము కరచిందని చెప్పి సహాయంగా హాస్పిటల్‌కు రమ్మని అడిగారు ఇద్దరూ తొందరగా హాస్పిటల్‌కు వెళ్ళారు. అదృష్టంవల్ల డి. ఎమ్. ఓ. గారు వున్నారు. పాము కరచిందని తెలుసుకొని అతనిని పరీక్షించి కొన్ని మందులు వేశారు. కాని తగ్గలేదు పాము కాటుకు సరియైన మందు హాస్పిటల్‌లో లేదని జవాబిచ్చారు. ఇంతలో నరసింహారావుగారు పరుగెత్తుకుంటూ హాస్పిటల్‌కు వచ్చారు. అయితే ఏమి చేయమంటారని ఆయనను సలహా అడిగారు. పాముల నరసయ్యకు ఫోను చెయ్యమని జవాబిచ్చారు. వెంటనే 'పాము కరచింది' అని పాముల నరసయ్య ఆశ్రమానికి ఫోను చేశారు. 'కాసేపటికి లేచి కూచుంటాడు' అని సమాధానము వచ్చింది. అంతే. ఇంతలోకి వచ్చి చూచేటప్పటికి నిద్రనుంచి లేచినట్లు నరసింహారావుగారి కుమారుడు లేచి కూచున్నాడు. నేను చెప్పిన దానిపై నమ్మకము లేకపోయిన పువ్వాడ శేషగిరిరావుగారు, ఆంధ్ర జాతీయకళాశాల, మచిలీపట్టణమునకు గాని, మణిమాణిక్యం నరసింహారావుగారు, భాస్కరపురం, బందరు అనే అడ్రసుకు గాని వ్రాసి కనుగొనవచ్చును. పాము కరచినవారు ఇప్పుడు ప్రఖ్యాతి రచయితలయి 'మురయా' అను కలం పేరుతో తమ రచనలను ప్రచురిస్తున్నారు.

కేతవరపు రాజగోపాల్—బందరు.

* * *

## మంత్రాలలో సత్తాలేదా!

మంత్రాలలో సత్తావున్నది లేనిది తెలిసికొనుటకు భగీరథప్రయత్నం చేయనక్కరలేదు. ప్రతిగ్రామంలోనూ ఏదో ఒక చిన్న బాధకు మంత్రంపెట్టేవారెవరైనా వుంటూనేవుంటారు. పాముల నరసయ్యగారి పేరుప్రఖ్యాతులు అందరకూ తెలిసినవే టెలిగ్రాంద్వారా వారు పాముకాటుకు చికిత్సచేయడం ప్రసిద్ధిజెందిన విషయమే. దేవాలయాలు నిర్మించడానికి ఆధారం ఏమిటి? విగ్రహంక్రింద యంత్రం వేస్తారు గదా! ఆ యంత్రానికి జపంచేసి ధారాదత్తం చెస్తారు. దానిబలమే దేవునిబలం. నేనెరుగున్న మంత్రవేత్తలు కొందరిని యీ క్రింద పరిచయం చేస్తున్నాను.

**శ్రీ నిమ్మరాజు అప్పారావుగారు:-**
వీరు రేపల్లెతాలూకా 'ప్రజ్ఞం' అనే ఒక పల్లెటూరిలో ఎలిమెంటరీ స్కూలు టీచరు. రేపల్లెనుంచి నంగేటిరేవు వెళ్లు బస్సుమీద గాని, కూచినపూడి వెళు బస్సుమీదగాని 0-6-0 చార్జితో కూచినపూడివెళ్ళి అచటి నుంచి 3 మైళ్లు కంకరరోడ్డుమీద ప్రయాణం చేస్తే 'ప్రజ్ఞం' వెళ్లవచ్చును. బ్రాహ్మణులు. దాదాపు 46 సం॥ వయస్సు. వీరు పాము-తేలు యిత్యాదులకు చికిత్స చేస్తారు. వెళ్ళేసరికి ఏమాత్రం ఊపిరివున్నా బతికినాసన్న మాటే. కొన్నివేలమందికి బహుశః ప్రాణదానంచేసివుంటారు. వీరనుసరించు మంత్రోపాసనకు కొన్నినియమములు లున్నవి.

**శ్రీ సుబ్బారావుగారు:—**
వీరిది కూచినపూడిగ్రామమునకు మైలు దూరంలో వున్న గరువు అనేగ్రామం. వైశ్యబ్రాహ్మణులు. వయస్సు 20. పైన చెప్పిన శ్రీ అప్పారావుగారిశిష్యులు. కొద్దికాలంనుంచి చికిత్సచేస్తున్నారు. (వీరు చికిత్సలుమానవులకేకాదు పశువులకుగూడా)

**శ్రీ తుంగల వీరరాఘవయ్యగారు:-**
వీరు భట్టిప్రోలుదగ్గరవున్న విలవరంలోని హాయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో ఉపాధ్యాయులు. అసలు వీరిది కృష్ణాజిల్లా దివితాలూకా తుంగలవారిపాలెం (వేకనూరుదగ్గర). ఉద్యోగరీత్యా విలవరంలో ఉంటున్నారు. వీరుకూడా అద్భుతంగా పాము, తేలు, యింకా జెఱ్ఱి, చెల్లి యీలాంటివాట్లకు చికిత్సచేస్తారు. ఒక మహాపురుషులు—వీరి పేరును విని—పోస్టులో వీరికి ఆమంత్రిమును పంపినారు. (ప్రత్యక్షోపదేశము లేదు.) వీరి పేరు చెప్పుచున్నంతసేపూ రోగి (సర్పదష్టుడు) చావడు. (వీరి చికిత్సలు పశువులకు కూడా పనిచేస్తాయి)

**శ్రీ వెంకటసుబ్బయ్యగారు:—**
వీరు కృష్ణాజిల్లా—మోపిదేవి దగ్గరఉన్న రావిపాలెం నివాసులు. కమ్మ వంశోద్భవులు. వీరు కంఠసర్పి (మరొక భయంకర వ్యాధి, దాని పేరు నాకు సరిగ తెలియదు—'నుసిరి' అని కొందరు అంటారు. 24 గంటలలో చంపివేస్తుందట. మెడచుట్టు చెల్లి లేచినట్టు లేస్తుందట.) కి చికిత్స చేస్తారు. వీరివల్ల చికిత్స పొందినవారివల్ల వీరి సంగతి విన్నాను. (ప్రత్యక్షంగా వీరిని నే నెరుగను. అందుచేత యింతకంటె ఎక్కువ వ్రాయలేకపోతిని.) వీరికి మా ప్రాంతంలో మంచి పేరు వున్నది.

**శ్రీ దీవి వెంకటాచార్యులుగారు:—**
వీరిది మాగ్రామమే. నేను బాగాఎరుగున్నవారు. వైఖానసులు. 60 సం॥ వయస్సు. వీరి అమ్మగారు కీ॥ శే॥ రాజమ్మగారు జెఱ్ఱిమంత్రం పెటడంలో పెటిందిపేరు. ఒకటి రెండుసార్లు నాకుగూడా అనుభవమే. శ్రీ ఆచార్యులుగారుకూడా జెఱ్ఱిమంత్రం పెటడంలో నిపుణులు. దురాయి యిస్తారు. పురుగుఊదుట మొదలగువాట్లకు పసిపిలలకు చీటి కటుతారు.

**శ్రీమతి అగ్నిహోత్రం చల్లమ్మగారు:**
వీరు, శ్రీ (పైనచెప్పిన) ఆచార్యులుగారి సోదరి. రేపల్లె తా॥ చోడాయపాలెం. వయస్సు 45. వీరును జెఱ్ఱిమంత్రం మొదలయినవి పెట్టుతారు. ఒకసారి ఆగ్రామం పెళ్ళికి వెళ్లుతూ నేను, పడవనుంచి రెండు చేతులతో పంచి, గొడుగు వగైరాలు పట్టుకొని ఉరికాను ఇంతలో పడవ వెనుకకు జరిగినందున ఒడ్డున నే లోతులో పడ్డాను. కంఠంలోతు వచ్చింది. కుడికాలు బెణికింది. ఏలాగో యింటికి వెళ్లాను. ఆరాత్రి నానాబాధపడ్డాను. కాలుకదపలేనిస్థితి. ఈ స్థితిలో ఘంటసాల శ్రీ రామకృష్ణశర్మగారు (ప్రస్తుతం కూచినపూడి హైస్కూలులో హిందీ పంతులు) మంత్రం వేయిద్దామని శ్రీమతి చల్లమ్మగారి దగ్గరకు నన్ను చేత్తోపట్టుకొని నడిపించి తీసుకొని వెళ్లారు ఒకటే మంత్రం. మధ్యాహ్నానికి బాధలేదు.

కవితా కామేశ్వర దైవజ్ఞ శర్మ.
వేకనూరు, (దివి తా. కృష్ణాజిల్లా)

★

# అభిమాన సినీతార

రైలు నెమ్మదిగా పోతోంది. అప్పుడే వాన జల్లు కొద్దికొద్దిగా మొదలెట్టింది. ఫస్టు క్లాస్ కంపార్టుమెంటులో కూర్చొని వున్న మధు పేపరు మడుస్తూ కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు. వానజల్లు కాస్త పెద్దదయింది. మధుకు, పక్కనే హేండ్ బాగ్‌ను తలగడలా పెట్టుకు నిద్రపోతున్నది సావిత్రి. చిన్న జల్లు కిటికీలోనుంచి లోపలికి కొట్టింది సావిత్రి నెమ్మదిగా కళ్ళు తెరిచింది. మధు వేపు చూస్తూ లేచి కూర్చుంది. ఆమె చూపుల్లో అంతర్యాన్ని గ్రహించిన మధు నవ్వుతూ లేచి కిటికీ అద్దం దించాడు.

"ఇంకా బెజవాడన్నా రాలేదేమిటి?" ఒళ్లు విరుచుకుంటూ తన వాచి వైపు చూచుకుంటూ అంది సావిత్రి. "అప్పుడే 4 గంటలయింది"

"మనస్సంత వేగంగా పోదుగా ట్రెయిన్" చిన్నగా నవ్వాడు మధు

"అలా పోతే ఈ సరికి హైదరాబాదు పోయుండే వాళ్ళమేగా"...ఆత్మాభిమానం గాయపడ్డం ఇష్టంలేక అంది సావిత్రి

"ఎలా అయినా పుట్టిల్లంటే ఎందుకనో అంత ప్రేమ ఆడాళ్ళకి?"

"మగవాళ్ళంత కృతఘ్నులు కారు గాబట్టి ఆడవాళ్ళు..." బాణంలా వచ్చింది జవాబు

"ఓహో" ఎగతాళిగా పక్కనుండే పేపరు తీసుకున్నాడు మధు ఆమె తీవ్రమైన దృష్టినుంచి తప్పించుకోడానికి.

కంపార్ట్‌మెంటులో అదృష్టవశాత్తూ ఇంకెవ్వరూ లేనందువల్ల ప్రాణం హాయిగా ఉంది సావిత్రికి. లేచి టాయిలెట్ బాక్స్ తీసి సోప్‌బాక్స్ తీసుకుంది సావిత్రి

"సినిమా తారలకు సౌందర్యము నిచ్చు లక్స్ టాయిలెట్ సబ్బునే ఎల్లప్పుడూ వాడుదురు..." మధు పెద్దగా చదివాడు. వినిపించుకోకుండా విసురుగా వెళ్ళింది బాత్‌రూమ్ వేపు సావిత్రి 5 నిముషాల్లో ముఖం కడుక్కొని టవల్‌తో తుడుచుకుంటూ వచ్చింది సావిత్రి

"తర్వాత కార్యక్రమం...?" ఎగతాళిగా అన్నాడు మధు.

"జడ వేసుకోడం." ఉక్రోషంగా అంది సావిత్రి. టాయిలెట్ బాక్సును తీసుకుని మధుకు ఎదురుగ్గా వున్న బెర్తుమీదకు వెళ్ళి కూర్చుని మొదలెట్టింది మేకప్.

"కాస్త త్వరగా కానిస్తే...స్టేషన్

## పవని నిర్మలప్రభావతి

వస్తోంది" వినయం చిందించాడు మధు. "అలాగే" వూహించనంతటి నెమ్మదిగా వచ్చింది జవాబు

బెజవాడ స్టేషన్లో ట్రెయిన్ ఆగింది. తుంపర తుంపరగా పడోంది వాన.

"అబ్బ! ఎంతరష్‌గా వుంది స్టేషన్!... నే నెప్పుడూ చూళ్ళేదు ఇంత రష్‌గా వుండటం!" సావిత్రి కళ్లు పెద్దవిచేస్తూ మధు వేపు తిరిగింది.

న్యూయజ్ కాలం సమస్యను సీరియస్‌గా చదువుతున్న మధు తప్పనిసరిగా పేపర్లోంచి తల పైకెత్తాడు కొద్దిగా ఆశ్చర్యపడి, ఆశ్చర్యపడ్డట్టు కనిపించకుండా కిటికీ పక్కన కూర్చున్నాడు బయటికి చూస్తూ.

స్టేషన్ చాలా క్రిక్కిరిసివుంది. మూడేళ్ళ పిల్లల దగ్గర్నుంచి ఎనభై ఏళ్ళ ముసలివాళ్ళదాకా వున్నారు ఆ జన సమూహంలో. అందరూ దేనికోసమో వెదుకుతున్నట్టుగా వున్నారు. యువకులు, కాస్త బలంగలవాళ్లు ట్రెయిన్‌మీదికి తోసుకొస్తున్నారు. అక్కడక్కడా ఎర్రటోపీలుకూడా కనిపిస్తున్నయ్.

తమాషాగా తల బయటికి పెట్టి చూస్తున్న సావిత్రి జనమంతా తమ పెట్టివేపే రావటంచూచి కాస్త వెనక్కు సర్దుకుని కూర్చుంది. అప్పుడే జనంలోనుంచి "అదుగో...సురేఖ" అనేక కంఠాలు కొన్ని వందల మాట్లు వినిపించాయ్.

నిముషంలో ఆ ఫస్ట్ క్లాస్ కంపార్టుమెంట్ చుట్టూ ఇసక వేస్తే రాలకుండా నిండిపోయ్యారు జనం.

జనంలోనుంచి తోసుకుంటూ ఓ స్థూలకాయుడు షుమారు 45 ఏళ్లుంటాయ్ తెల్లని గ్లాస్కో పంచ, లాల్చీ, పైన జరీకండువా, చేతిలో పూలదండతో గబగబా కంపార్టుమెంట్‌లోకి ఎక్కాడు.

జనం పెట్టె చుట్టూ మూగగానే మధు కాస్త ఆందోళన పడ్డాడు. అర్థంకాక అలా చూస్తున్న మధు, ఆయనను చూచి మరీ ఆశ్చర్యపడ్డాడు వస్తూనే ఆయన" "నా పేరు టి కృష్ణన్, కృష్ణా పిక్చర్ ప్యాలెస్ మేనేజర్ని, ఓనర్నుకూడా నేనే. మీరిక్కడికి "పరాజయం" పిక్చర్ శతదినోత్సవాలకు ఈరోజు రావటానికి అంగీకరించారని మూడురోజుల క్రిందటే తెలిసి అన్ని ఏర్పాట్లూ చేసి ఉంచాను"......... గుక్క తిప్పుకోటానికి ఆగి జవాబు ఆశించకుండానే మొదలెట్టాడు. "సురేఖగారి అభిమానులంతా ఈ జనంలో వున్నారు దయచేసి మా కోర్కె కాదనకుండా థియేటర్‌కు వెళ్దాం రాండి. కారు రెడీగానే వుంది. ఏమండీ రామంగారూ? మీరూ సురేఖగారూ బయటకువస్తే జనం చూచి ఆనందిస్తారు......" గొంతు సవరించుకుని మళ్ళీ అన్నాడు కృష్ణన్ "మిమ్మల్ని పుష్పమాలాలంకృతుల్ని జేసి తీసికెళ్తాము.." ఇక ఆనందంతో మాట్లాడలేకపోయాడు కృష్ణా పిక్చర్ ప్యాలెస్ మేనేజరు కృష్ణన్

# ★ అభిమాన సినీతార ★

జనంలోంచి "సురేఖగారూ దయచేసి బయటికిరండి" అనే కేకలు వినపడుతున్నయ్. ఎవరికో లోపలుండే వ్యక్తులు సరిగా అగుపడక కొంతోలు కిటికీ అద్దం ఎత్తేశారు. సావిత్రిని ఆపాదమస్తకం తిలకిస్తున్నారు. జనం కొందరికి ఒంటిమీద స్పృహ కూడా బొత్తిగా పోతోంది.

మధుకు పరిస్థితి అర్థం చేసుకోటానికి అరనిముషం పట్టలా!

సావిత్రి నిశ్చేష్టురాలై బెర్తుమీద మూలగా ఒదిగి కూర్చుంది.

మధు, కృష్ణన్ భుజంమీద నెమ్మదిగా తట్టూ అన్నాడు.

"సర్! మీరు పొరబడ్డారు నా పేరు మధు. ఆవిడ నా వైఫ్ సావిత్రి. మేము మీ రనుకుంటున్న.........."

కృష్ణన్ పెద్దగా నవ్వాడు.

"రామంగారూ! ఇంతకు ముందులా మమ్మల్ని నిరాశపరచి మారుపేర్లతో వెళ్ళిపోదామని చూస్తున్నారు మీరు ఎంతకాదన్నా ఆవిడే సురేఖాదేవే, మీరు వారి పర్సనల్ అసిస్టెంట్ రామంగారే. దయచేసి మా కోరిక నెరవేర్చండి"

చూచే జనానికి ఇక ఓపిక లేకపోయింది. అందాకా ఇంకా బయటికి వస్తుంది, ఇంకా బయటికి వస్తుంది అని వెయిట్ చేస్తున్న వాళ్లల్లా కాస్త ఉద్రేకంగా ముందుకు వచ్చారు.

మధు ఇట్టే గ్రహించాడు రానున్న పరిస్థితిని

కొయ్యబొమ్మలా గుడ్లు మిటకరించి చూస్తున్న సావిత్రిని చూచి జాలిపడ్డాడు.

కాస్త హెచ్చుస్థాయిలో అన్నాడు కృష్ణన్‌తో.

"కృష్ణన్ గారూ! మొదట ఇక్కడికి వచ్చిన జనంతో కాస్త మాట్లాడి తర్వాత థియేటర్‌కు పోదాం!"

కృష్ణన్ ఎగిరి గంతేశాడు. వెంటనే పక్కనుండే తన అసిస్టెంట్‌తో నెమ్మదిగా ఏదో చెప్పాడు. అతను పెట్టె తలుపు దగ్గరికివచ్చి అక్కడ క్రిక్కిరిసి వున్న యువకులతో ఏదో చెప్పాడు.

వైర్‌లెస్‌లా ఆ వార్త ఏమిటో స్టేషనంతా పాకిపోయి, నిశ్శబ్దత ఆవరించింది ఒక్కసారిగా.

మధు, సావిత్రికి దగ్గరగావెళ్ళి అప్పటి పరిస్థితిని ఆమె చెవిలో చెప్పాడు. చెయ్యాల్సిన కార్యక్రమం హింట్స్‌లా వివరించాడు.

సావిత్రి, మధు మాట్లాడుకోటం జనం వింతగా చూస్తున్నారు. సినిమాతార సురేఖ మాట్లాడ్డే ఎలావుంటుందోనని చెవులు రిక్కించుకు వింటున్నారు.

సావిత్రి, మధు తలుపు దగ్గరికొచ్చి నిలబడ్డారు.

ఇద్దరూ జనానికి నమస్కరించారు.

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అయిదారుగురు ఫోటోగ్రాఫర్లు వచ్చి ఇట్టే స్నాప్స్ తీసేశారు మళ్లీ వెనక్కు సర్దుకున్నారు. మధు గొంతు సవరించుకుంటూ మొదలెట్టాడు:

"మహాజనులారా! దయచేసి నేను చెప్పబోయేది శాంతంగా వినగోరుతాను. మీకు సినీతార సురేఖపట్ల చూపించు ఆదరాభిమానాలకు నాకెంతో సంతోషంగావుంది. కాని నేనీ విషయం మీకు తెలియపర్చేటందుకు ముందు చాలా విచారిస్తున్నాను. ఈవిడ మీ రనుకుంటున్న సినితారం సురేఖ కాదు. సావిత్రి... నా భార్య. నా పేరు మధు..." జనంలో కలకలం బయల్దేరింది అందరిదృష్టీ సావిత్రిమీద వుంది.

ఇంతలో మధుమాటలు వినిపించకుండా నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ "మహాశయులారా" అంటూ ఓ పెద్దకేక వినబడింది. అందరి కండ్లు, చెవులు అటువేపు మొగ్గాయి. స్టేషనుకు ఓ మూలవైపునుంచి పూలతో అలంకరించిన ఓ కారుమీది లౌడ్‌స్పీకర్ ఇలా వాగింది పెద్దగా "సినీతార శ్రీమతి సురేఖ, ఆమె పర్సనల్ అసిస్టెంట్ రామం, నళిని, జయ, మూర్తి మొదలైన సినిమాతారల్లు వాణీవిలాస్‌లో ఇప్పుడే దిగారు ..." కారు సాగిపోయింది.

మంత్రముగ్ధుల్లా జనం స్టేషన్ కటకటాలను, పోలీసులను కూడా లెక్కచెయ్యకుండా స్టేషన్ బయటకి పరుగెత్తారు.

మధు వెనకనిల్చునివున్న కృష్ణన్ ఒక్కసారిగా మధును తోసుకుని ప్లాట్‌ఫారమ్ మీదికి దూకాడు.

అంతదాకా పచ్చజెండా వూపితే ఏం ప్రమాదం తనమీదికి ముంచుకొస్తుందోనని తటపటాయిస్తున్న గార్డు, ప్రాణం అంతా బిగపట్టి విజిల్ వేశాడు.

గమ్యస్థానం చేరుకోటానికి గంభీరంగా కూతకూస్తూ, స్టేషన్నుంచి బయల్దేరింది ట్రెయిన్. క్షణంలో స్టేషన్ ఖాళీఅయింది.

★

# వ్యర్థ మనోరథం

జమ్మి సుశీలారాణి

సూర్యాస్తమయ మయింది. సూర్యుని చివరికిరణాలు కైలాసశిఖర సానువులను మృదువుగా స్పృశిస్తున్నాయి. సిద్ధసతులు పారాణికాళ్లతో తిరగటం వలన ఆ ఎఱుపు రంగు అంటుకున్నదేమో నన్నట్లుగా ఆకాశమంతా ఎఱ్ఱబడింది. పరమేశ్వరుని అర్ధాంగి, దక్షతనూభవ అయిన సతీదేవి చింతాక్రాంత వదనంతో చెక్కిట చేయిచేర్చి ఒక స్ఫటిక శిలావేదికపై ఆసీనురాలైనది. ఆమె తనకలువ రేకులవంటి కన్నులను మాటిమాటికీ శిఖరం దిగువన మెలికలు తిరిగి సాగిపోతున్న బాట వంకకే త్రిప్పి చూస్తూ కూర్చున్నది. నాలుగైదు రోజులనుంచీ ఆమె అట్లాగనే ఎదురు తెన్నులు చూస్తున్నది. ఒకవేళ తన తండ్రి దక్షప్రజాపతి యజ్ఞ దర్శనార్థము తనను తోడుకొని రమ్మని పరివారమును పంపుతున్నాడేమో ననే ఆశవలన ఆమె ఆవిధంగా చూస్తున్నదేమో. కాని అటువంటి జాడ యీక్షణం వరకూ ఏమాత్రమూ కనబడలే దామెకు. ఆ యాగమును గురించిన వార్తలు మటుకు చాలా వినవస్తున్నవి. మునులు, ప్రజాపతులు, మహర్షులు, దేవతలు, సర్వ దిక్కులవారూ కూడా భార్యాసమేతులై తన తండ్రి చేసేటటువంటి 'బృహస్పతి సవనము' అనే ఆ యాగమునకు ఆహ్వానితులై వెళ్ళి, నయనానందముగా అవన్నీ చూసి దక్షుని చేత తగిన పూజల నందుకొని వస్తున్నారు. ఆమెకు మటుకు యింత వరకూ ఏ ఆహ్వానమూ లేదు. దానికి కారణం మామా అల్లుళ్ళ మధ్య గల విరోధమే. విరోధం సంగతి తలచుకోగానే సతీదేవికి దుఃఖమాగలేదు. ఇలా విషాదంలో మునిగిపోయిన ఆమెకు ఎంత ప్రొద్దుపోయినదీ తెలియకుండా చంద్రోదయమయిపోయినందు వలన మందాకినీ నదిలోని కలువలన్నీ వికసించి సతీదేవిని చూసి జాలిపడినాయి. కైలాస శిఖర స్ఫటిక మణుల్లో చంద్రుడు ప్రతిబింబించగా అతనిలోని నల్లమచ్చ కూడా ప్రతిఫలించి, ఆ కళంకం సతీదేవి మనస్సులో గూడుకట్టుకొన్న దుఃఖం యొక్క ప్రతిబింబ మనిపించింది. నక్షత్రాల సముదాయం ప్రతిబింబించి ఆమె అశ్రద్ధగా పారవేసికొన్న ముక్తావళివలె భాసించినది. చివరి కామె విషణ్ణ వదనంతో వెన్నెల వెలుగులో కలిసిపోయిన తన స్ఫటికపు భవనానికి వెళ్లిపోయింది.

మర్నాడు అరుణోదయం కాగానే సతీదేవి మనస్సు బరువుగా వుండటం చేత, శివుని పూజకొరకు పూలను తీసుకువద్దామని వనంలోనికి వెళుతున్న చెలికత్తెలను వారించి తాను పూలసజ్జను తీసుకొని తోటలోనికి వెళ్లింది. సూర్యుని లేతలేత కిరణాలకు ప్రతి పువ్వూ విచ్చుకొని సతీదేవిని పలకరించాయి. దానితో ఆమె మనస్సు కొంతకలక తేరింది. క్రమంగా ఆమె ప్రతిచెట్టునూ చూస్తూ మెల్లిమెల్లిగా అక్కడున్న సరోవర తీరానికి వెళ్ళింది. అందులోని రాయంచలు చేసే రొదలను వింటూ తెల్లతామరలను కోస్తున్నది ఆమె. ఇంతలో ఆకొలనునీటిలో ఆకాశపథాన పోయే వాహనాల నీడ లామెకు కనపడ్డాయి. వెంటనే ఆమె కుతూహలంతో ఎత్తైన శిఖరం ఒకదాని మీద నిలచి తల ఎత్తి వాటిని పరికించింది. గంధర్వులు, కిన్నరులు, దేవతలు అధిష్ఠించిన విమానాలవి. వాటిలో భర్తృసమేతలై వింత వింత చీనిచీనాంబరాలు, విలువైన ఆభరణాలు ధరించి సూర్యకాంతికి అవన్నీ మెరిసిపోతూ ఇంద్రధనస్సులను సృష్టించగా కలకలస్వనాలతో సరస సల్లాపాలాడుతూ దక్షయజ్ఞమును పొగడుతూ ఆ విశేషములనే చెప్పుకొంటూ యజ్ఞదర్శనార్థులై వెళుతున్న గంధర్వాంగనలను, కిన్నరాంగనలు, దేవతాస్త్రీలను చూచిందామె. ఆదృశ్యము చూడగానే ఆమె మనస్సులో తానూ తన భర్తతో కలిసి అలాగే వెళ్ళవలెనని కుతూహలం కలిగిందామెకు. ఆ కుతూహలం ఆమె మనస్సు నంతా ఆక్రమించి బలీయమై చివరకు తండ్రి పిలువకపోయినా వెళ్లితీరాలనే నిశ్చయం కలుగచేసింది. వెంటనే ఆమె పరమ శివుని అనుజ్ఞ కోరటానికి, కోస్తున్న పూలనుకూడా అక్కడనే వదలివేసి మహాదేవుని పూజాగృహం వైపునే వెళ్ళిపోయింది.

పూజాగృహంలో ఆమె అడుగుపెట్టగానే పరమేశ్వరుడు కండ్లు తెరచి పుష్పాలు లేకుండా వట్టి చేతులతో వచ్చిన ఆమె కేసి ఒకసారి చూశాడు. ఆయన ధరించిన సర్పరాజుల పడగల మీద మణుల కాంతులు నలువైపులా కమ్ముకొన్నాయి. సతీదేవి సరిగంచు పయట కొంగును వేలికి మెలి వేస్తూ భర్తకేసి ఒకమారు చూసి సన్నని మందహాసం చేసి తలవంచుకొన్నది. ఆమె ఎఱ్ఱని పెదవి మీద ఆ చిరునవ్వు వ్యాపించి ఎఱ్ఱటి పగడం మీద ఉంచిన ముత్యపు పూసలా మెరిసింది. పరమశివుడామెని చూసి చిరునవ్వు చిలకరించి ప్రశ్నార్థకంగా చూశాడు. వెంటనే ఆమె "నాయనగారు యజ్ఞము చేస్తున్న సంగతి మీకు తెలిసినదేకదా! అందరూ కూడా ఆ యజ్ఞం చూడటానికి వెళుతున్నారు." ఇల్లా అంటూ వుండగానే ఆమె మనస్సులోని మనోరథం గ్రహించివేసిన పరమేశ్వరుడు తిరిగి మరొక్కమారు నవ్వాడు. దానితో ఆమెకు కొంతబలం వచ్చినట్లయి పొంగిపోతూ యిల్లా చెప్పింది: "ఇతర వనితలంతా కూడా మంచి మంచి అలంకారాలను చేసుకొని భర్తలతో కలసి విమానాలమీద ఆకాశ మార్గాన యజ్ఞభూమి వైపు వెళుతున్నారు. నాకు కూడా మంచి మంచి ఆభరణాలు, వస్త్రాలు ధరించి మీతో కలసి ఆ యజ్ఞానికి వెళ్ళాలని చాలా కుతూహలంగా వుంది. నా సోదరీగణమంతా భర్తలతో కలిసి అక్కడకు వస్తారు. నా తలిదండ్రులను, సోదరీజనాన్ని,

# ★ వ్యర్థమనోరథం ★

పుట్టినిల్లును చూడాలనే స్త్రీ సహజమైన కోరిక నా మనస్సునంతా ఆక్రమించింది. జనక గురు సుహృజ్జన నాయక గృహములకు పిలువకపోయినా సజ్జనులు వెడుతూనే ఉంటారు కనుక నాయీ మనోరథం మన్నించవలసింది." శివుడు నవ్వు మొహంతో ఆమెను తిలకించాడు. వెంటనే ఆయనకు పూర్వం బ్రహ్మలు సత్త్రయాగం చెయ్యగా దక్షుడచ్చటికి వచ్చినప్పుడు తాను లేచి నమస్కరించలేదనే కారణంగా తనను దూషించి శపించటం జ్ఞాపకం వచ్చి నొచ్చుకున్నాడు. కాని పైకి నవ్వుతూనే "సతీ! బంధువుల యిండ్లకు పిలువకపోయినా వెళ్ళవచ్చునన్నావు కదా! కాని వారు క్రోధమనస్కులయినట్లయితే వెళ్ళకూడదు. అటువంటి కుటిలులు ఆత్మగర్వంతో తమ యిండ్లకు వచ్చిన సజ్జనులను అవమానించుతారు. దేనికీ జలించని మనుష్యుడైనా స్వబాంధవుల దురుక్తులు మనస్సులో నాటుకుని బాధపెట్టే మానవుడు కృశించిపోతాడు. నీవు దక్షప్రజాపతి ముద్దుకుమార్తెవైనా కూడా నా అర్ధాంగివైనందున నా సంబంధముచేత అక్కడ అవమానింపబడతావు. నా మాట నతిక్రమించి వెళ్ళినట్లయితే నీవు తప్పక అవమానం పాలుకాగలవు" అని చెప్పి గట్టిగా వెళ్ళవద్దంటే బాధపడుతుందనీ, వెళ్ళమన్నట్లయితే వెళ్ళి అవమానం పాలవుతుందనీ భావిస్తూ మౌనం ధరించాడు ఈశ్వరుడు. నిశ్చలంగా ఈమాటలను వింటున్న సతీదేవి తన కోర్కెకు విరుద్ధం జరుగుతోందని తెలిసి బయటకు వెళ్ళిపోయి చాలాసేపు దుఃఖించింది. ఆమె పెద పెద్ద కండ్లనుంచి అశ్రువులు అవిరళంగా కురిసి చీర చెంగునంతా తడిపి వేశాయి. చివరకామె అభ్యంతరం చెప్పాడని పతిమీద కోపంతోనూ, తండ్రిని చూడాలనే కోరికతోనూ ఆమె పుట్టినింటికి బయలుదేరింది. ఇట్లా మూఢమనస్కురాలై వెడుతున్న సతీదేవిని చూచి కొందరు రుద్రానుచరులూ, యక్షులూ ఆమె అలంకార సామగ్రి మొదలైన వాటిని తీసుకొని, ఆమెను వృషభంమీద కూర్చుండబెట్టి ఆమె వెనుకనే ప్రయాణమై యజ్ఞభూమివైపుగా వెళ్ళిపోయారు.

యజ్ఞధామాన్ని చూడగానే సతీదేవి పరమ హర్షం పొందినది. సంతోషంతో యజ్ఞశాలను ప్రవేశించిన ఆమెను చూసి తల్లి, సోదరీజనము తప్ప తక్కిన సభలో ఉన్న జనమంతా దక్షునివలన భయంచేత ఊరుకున్నారు. తల్లి, పినతల్లులు ఆమెను కౌగలించుకొని ఆనందబాష్పాలు కురిపిస్తూ క్షేమవార్తలు అడిగారు. తండ్రి తనవంక చూడకపోవటంచేత ఆమె వారి ఆదర వాక్యాలను గ్రహించలేకపోయింది. ఇట్లా తండ్రిచేత ఆదరించబడని ఆమె, శివునికి యాగ ఆహ్వానము లేకపోవటమే



మైసూరు రాజభవన సింహద్వారం [లోపల కనిపించేది గాయత్రీ ఆలయగోపురం]

ఫోటో: టి. వాసుదేవన్ - మద్రాసు.

కాకుండా యజ్ఞంలో ఆయనకు హవిర్భాగములు లేకపోవటం చూసి క్రోధం పట్టలేకపోయింది. వెంటనే యజ్ఞసభా మధ్యంలో నిలచి ప్రతికూలుడైన తండ్రినిచూసి రోష వాక్యాలతో ఆమె "మహాత్ముడైన రుద్రుని అవమానించిన వానిని నిన్నొక్కడను చూశాను. మహాత్ములకు హాని చేసేవారి జన్మలు ఎందుకు? వృథాసుమా! రుద్రుడు బీదవాడని, నీవు అధిక సంపన్నుడనని నీ గర్వం. కాని ఆయనకున్న అణిమాది అష్టయిశ్వర్యములు నీకెట్లావస్తాయి? భర్తని అవమానించినవారి నాలుక చీల్చవలెననీ, లేక తాను చావవలెననీ, అదీ చేతకాకపోయినట్లయితే చెవులు రెండూ మూసికోవలెననీ ధర్మవర్తనులు చెప్పుతారు. ఘనుడైన ఈశ్వరుని దుష్టాత్ముడవై నిందించిన నీయొక్క కుమార్తెను అని చెప్పుకోవటానికి సిగ్గువేస్తున్నది. కనుక ఈ శరీరం విడిచిపెట్టి పవిత్రురాలనవుతాను. ఓయి మూఢుడా! శివుడు నన్ను ఆదర పరిహాస వాక్యాలతో 'దక్షతనూభవా' అని పిలుస్తూఉంటే మనస్సులో నొచ్చుకుంటూ బాధపడుతూ బ్రతకలేను, ఇంతకంటె చావునయము" అని పలకగా విని సభ్యులంతా నిశ్చేష్టులయినారు. వెంటనే ఆమె యిక ఆలస్యము చేయక ఆచమనం చేసి శుచియై మౌనంధరించి భూమిమీద కూర్చుని యోగమార్గమున శరీరం విడువదలచి ప్రాణవాయు నిరోధం చేసింది. పరమేశ్వరుని అంకపీఠమందు ఆదరంతో కూర్చునే దేహం, దక్షుని దోషంచేత విడువ తలచిన సతీదేవి మనస్సులో పరమేశ్వరుని నిలిపి యోగసమాధి తాల్పగానే ఆయోగసమాధి వలన పుట్టిన అగ్నిజ్వాలలు ఆమెశరీరాన్ని వెంటనే దహించివేసినవి.

సభ్యుల హాహాకారాలు ఆ అగ్నిజ్వాలల వలెనే మిన్నంటాయి. ★

# వనితాలోకం

మంచీ చెడ్డా:

# గుమ్మడికాయల దొంగలు

వంకినేని జానకీదేవి
(ఏలూరు)

వెనకటికెవరో "గుమ్మడికాయల దొంగ" అంటే భుజాలు తడుముకున్నాడట. గుమ్మడికాయలకు బూడిద ఉండకపోతే భుజాలు తడుముకొనే అవసరం పాపమా దొంగకు కలిగేదికాదు. ఈ సామెతే పుట్టకపోయేది. ఆధునిక యుగంలో మొదటనే బూడిద తుడిచివేసి గుమ్మడికాయలు దొంగిలిస్తారు. అయినా భుజాలు తడుముకొనే అలవాటుమాత్రం అలాగే నిలచిపోయింది.

పిల్లికాబోలు వంటింట్లో పాలు త్రాగేసింది అంటే వెంటనే మూతి తుడుచుకుంటుంది మా వంటావిడ. అబ్బా ఎక్కడ నుంచమ్మా ఈ మల్లెలవాసన అంటే వెంటనే చొక్కా వాసన చూసుకుంటారు మా ఇంటాయన.

ఈ మధ్యన మా శారద వ్యాసం ఒకటి పత్రికలో పడేసరికి తోటికోడలూ, ఆడపడుచూ, "చూడు వదినా నీమీద ఎలా వ్రాసిందో అంటే చూడు మరదలా నీమీద మరీ ఇదిగా వ్రాసింది" అని ఒకరి భుజాలు ఒకరు తడిమిపెట్టుకున్నారట. ఆడవాళ్ళ నైజమింతేలే అనుకునేరు.

ఎరిగున్నవాళ్ళు ఏదైనా పత్రికకు కథ వ్రాస్తే ఉన్నవీ, లేనివీ మనమీదే వ్రాస్తున్నారని ఉలికులికిపడేవాళ్ళు చాలమంది.

ఆ మధ్య మా స్నేహితురాలు సరదాగా కథ వ్రాసి పత్రికకు పంపింది. అపకంగా క్లబ్బులలో పెద్దమనుషులంతా వాళ్ళాయనను చూసి "ఏమిటోయ్ ఈ ఆవిడ ఇలా వ్రాసేస్తోంది? ఎవరిమీదేమిటి ఆ దుమారం?" అని ఒక్కటే ఇదిగా అడిగేసేరట. పాపం! వీధిలో, సమాధానం చెప్పలేని ఆ అమాయకపు మనిషి, ఇంట్లో, తన పెళ్ళామేగదా అని మండిపడ్డాడట. మళ్ళీ ఆవిడ కాగితం మీద కలం పెటలేదు.

ఈ గుమ్మడికాయల దొంగల్లో ఇంకా పై తరగతివారున్నారు. వీరు గుమ్మడికాయల దొంగ ఎవరు? అనే ప్రశ్న వచ్చేవరకు కూర్చున్నచోట కూర్చోలేరు. నుంచున్న చోట నుంచోలేరు దొంగతనం బహిర్గతమయేవరకూ కాలు గాలిన పిల్లిలా తిరుగుతారు.

పైపెచ్చు ఒకోసారి వీళ్ళ బుజాలమీద బూడిద మరొకరికి అంటించ చూస్తారు!

మా తాతగారి ఊళ్లో ఒకావిడుండేది కొంచెం చేతివాటుమనిషి. కంటెలూ కాసులపేర్లూ కాదుగాని, ఒంటిపేట గొలుసులు అవీ చంటిపిల్లలవి పరుడున్న వాడి కంట బడకుండా వదలపరచేది. కాని పాపం! ఆవిడ నేర్పు అంతవరకే. ఉలుకెక్కువయిన మనిషి కావటాన ఊరుకోలేకపోయేది. అప్పుడావిడ మాటాశైలి చాలా చిత్రంగా ఉంటుంది.

(మచ్చుకి:) ఏమే సూర్యం!

పిల్ల మెడలో గొలుసు చూసిన జ్ఞాపకం నీవుగాని తీసివేసుకున్నావా?—

వదినా! [illegible] చేతులు మరీ బోసిగా ఉన్నాయి. ఒక జత గాజులు చేయించి పడేయరాదూ? — ఏమిటే రాముడూ! వంటెడు నగలతో చంటివాడిని అలా వదిలేస్తావు! రోజులేం బాగున్నాయని!— ఇదీ వరస.

ఈవిడ ధోరణి ఎరిగున్నవాళ్ళకి తమ వస్తువులను రాబట్టుకోవడం ఏమంత కష్టమనిపించేది కాదు.

ఇంటిదొంగను ఈశ్వరుడయినా పట్టలేడంటారు. మా ఆయన సామర్థ్యానికి ఈశ్వరుడుదాకా ఎందుకు నందికూడా అవసరం లేదు ఆయన ముఖకవళికలు అడక్కుండానే పట్టిస్తాయి.

నా బీరువాలో పదీ పరకా మాయం కావటం మామూలు. నే వెతుక్కొని కంగారుపడేలోపునే, వారు క్లబ్బుకనో, సినీమాకనో బయలుదేరుతూ, పదిరూపాయలుంటే చూడు జానకీ, నీకు మళ్ళీ ఇచ్చేస్తానన్నడంకూడా మామూలే మా ఆయన మనస్సెరుగున్నదాన్ని గాబట్టి మనసులోనే నవ్వుకొని ఊరుకుంటాను లేకపోతే అనుమానమంతా పనిమనుషులమీదే కదా!

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే ఈ భుజాలు తడుముకొనేవాళ్ళను గురించి మనం భయపడవలసింది అంతగా లేదు. ఎటొచ్చీ బూడిదను ఇతర్లకు అంటించే వాళ్ళను గురించే మనం జాగ్రత్తపడాలి ★

# సంరక్షణ: క్రమశిక్షణ



[పిల్లల సంరక్షణ గురించి, క్రమశిక్షణ గురించి, పలువురు మహిళలు సాధికారికంగా వ్యాసాలు వ్రాశారు. కొందరు పిల్లల సమస్యలగురించి, తాము అనుసరించిన పద్ధతులను గురించి, తమ అనుభవాలు వివరిస్తూ వ్రాశారు. పిల్లల పోషణకు సంబంధించిన బహుముఖ సమస్యలను ప్రతిఫలించే, ఈ వ్యాసావళిని ఇక్కడ అందజేస్తున్నాము.]

పసిబిడ్డలు ఆరోగ్యంగా ఉండాలంటే ముందర తల్లి, తాను గర్భిణీగా నున్నప్పటినుండీ శ్రద్ధవహించాలి. గర్భిణీస్త్రీలు సరియైన ఆహారమును తీసుకొనుట, కొంచెము వ్యాయామము పేరిట చిన్న చిన్న పనులు చేయుట, ఇటునటు తిరుగుట, కొంచెము నడక అవసరం. కొందరు భాగ్యవంతుల ఇళ్ళలో గర్భిణీస్త్రీలను కాలు కదలనివ్వకుండా ఉంచటం అలవాటు. ఇందువల్ల కాన్పు సులభంగా కాకపోవటం, శిశువు బలిష్ఠముగా ఉండకపోవటం జరుగుతూ ఉంటుంది.

తల్లి తినే ఆహారంలోనుంచే కొంతశక్తి బిడ్డకుకూడా పోతుంది. అందుకని తల్లి కడుపుతో ఉన్నప్పుడే కనీసం రోజుకు 2,100 కేలోరీ విలువగల ఆహారమును తినాలి. (అంటే అందులో ఉండాలిసినది 100 గ్రాముల ప్రొటీన్లు, 1. 5 గ్రాముల కాల్షియము, 30 మిల్లిగ్రాముల ఇనుము, 4000 యూనిట్ల 'ఎ'-విటమిను, 2 మిల్లిగ్రాముల 'బి' విటమిను, 800 యూనిట్ల 'డి' విటమిను ఇంకా కొవ్వు, విటమిను బి.2 కాంప్లెక్సు లాంటివి.)

వీటిలో విటమిను "డి", సూర్యరశ్మి దేహంమీద పడినప్పుడు మనకు లభిస్తుంది. మిగతావన్నీ మనంతినే పదార్థాలలో ఉన్నాయి. బిడ్డపుట్టిన తర్వాత మొదటి నెలకు 250 కేలోరీలు 5 వ నెలకు 600 కేలోరీలు, ఏడాది వెళ్ళేనప్పటికి 800 కేలోరీల విలువగల ఆహారం రోజూ పకుతుండాలి ఈ శక్తిగల ఆహారం పిల్లల కెట్లా లభిస్తుంది.

## తల్లి పాలు

ముఖ్యంగా పిల్లలకు ఇచ్చే ఆహారము పాలు. తల్లి చనుబాలలో ఒక ఔన్సుకు 20 కేలోరీల విలువగల ఆహారం లభిస్తుంది. బిడ్డకు 2 వ నెల వచ్చేటప్పటికి రోజుకు 20

## భైరవభొట్ల లీలాసీతారాం

(మద్రాసు)

ఔన్సులన్నా కావాలి. అంటే ఒక్కొక్కసారి నాలుగు ఔన్సుల పాలు బిడ్డ త్రాగితే, రోజుకు 5 పార్లు అన్నా పాలు ఇవ్వాలి. మరి ప్రతి తల్లీ ఇన్ని పాలు ఇవ్వగలదా? బలమైన ఆహారం తినే తల్లుల్లో 30 ఔన్సుల పాలు ఏర్పడుతాయి. అందుకని సామాన్యంగా బిడ్డకు 6 వ మాసం వచ్చేవరకూ తల్లిపాలు సరిపోతాయి. అయితే తల్లి పుష్టికరమగు ఆహారం తినాలి.

ఆ ఆహారంలో ప్రొటీన్లు, క్రొవ్వు, కార్బోహైడ్రేటులతోపాటు కాల్షియం, ఇనుము, భాస్వరము, విటమినులు ఉండాలి. ప్రొటీన్లు, కార్బోహైడ్రేటులు పప్పుల్లోనూ, భాస్వరంవరిఅన్నంలోనూ, క్రొవ్వు నేయి, నూనెలలోనూ, కాల్షియం, ఇనుము ఆకుకూరలు, కాయగూరలు, నువ్వులతోపాటు తిరగమూత స్తువుల్లోనూ, విటమినులు, కూరలు ఫలాలలోనూ బాగా ఉన్నాయి.

## పోత పాలు

పోతపాలతో పెరిగే పిల్లలకు తల్లిపాలతో



—ఫోటో: "[illegible]"

# ★ బొంబాయి సినిమా లేఖ

(ఆంధ్రపత్రిక విలేకరి)

డిసెంబరు 22 తో ఇక్కడ భారతీయ టాకీ రజతోత్సవ సప్తాహం ముగిసింది.

జరిగాయంటే జరిగాయి అనిపించుకున్న ఈ ఉత్సవాలకు దేదీప్యమానం, మహోజ్వలం, శోభాయమానంవంటి విశేషణపదాలు తగిలించడం ఏమంత అమోఘంగా బోలెడు రాణించదు. ఎందుకంటే చలనచిత్ర పరిశ్రమకు చెందిన అశేషజనం వీటిలో మహోత్సాహంతో పాల్గొనడానికి రాలేదు.

డిశంబరు 16 ఉదయం శ్రీ ఎస్. కె. పాటిల్ ప్రారంభోత్సవం జరిపిన ముహూర్తం నుండి జరిగిన వివిధ కార్యక్రమాలకు ఎక్కువగా వచ్చినవారు పరిశ్రమలో డిస్ట్రిబ్యూషన్, ఎగ్జిబిషన్ శాఖలకు చెందినవారే. కళకి సంబంధించిన వారిలో, గైరు హాజరైన 'తారావళి,' ఎక్కువ. వచ్చిన కొద్దిమంది నటీనటులకన్న రాని ఎక్కువమంది రాకపోయిన వైనమే కొట్టొచ్చినట్టు కనబడింది.

ఐ. ఎం. పి. ఏ. అధ్యక్షులు ఈ ప్రారంభోత్సవ సభలోనే మాట్లాడుతూ "ఇది చరిత్రాత్మక ఘట్టం" అంటూ అభివర్ణన చేశారు.

* * *

తొలిరోజున, దాదాసాహెబ్ ఫాల్కే చిత్రాలు "రాజా హరిశ్చంద్ర", "కాళీయ మర్దన్" చిత్రాలలో భాగాలను, ప్రభాత్ వారి "మాయా మచ్ఛీంద్ర"లో భాగాలనూ, ప్రభాత్ వారి మరోచిత్రం "దునియానా మానే" పూర్తి చిత్రాన్ని ప్రదర్శించారు. ఇవికాక, దాదాఫాల్కే ఎలా చిత్రాలు నిర్మించినదీ, ఆనాటి చిత్రనిర్మాణ విధానాలు ఎలా ఉండేదీ తెలియచేస్తూ నిర్మించిన ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని కూడా చూపించారు. ఈ చిత్రాలన్నీ ఆరోజులలో బహుళజనాదరణ పొందినవే. దాన్నిబట్టి, ఆనాడూ, చిత్రం విజయవంతం కావడానికి 'గ్లామర్, సెక్సుఅప్పీల్' వంటి హంగుల కన్న రసవత్తరమైన కథే ప్రాధాన్యం వహించేదని బుజువౌతూంది...

## డిసెంబరు 20 న...

డిసెంబరు 20 న ఫిలిం జర్నలిస్టుల సంఘం వారు బ్లావాట్స్కీ భవనంలో "చలనచిత్రాలు—దేశము" అనే విషయంపై గోష్ఠి నిర్వహించారు. పరిశ్రమకిచెందిన ప్రముఖులు పలువురు వచ్చి మాట్లాడారు. బొంబాయి విద్యామంత్రి శ్రీ శాంతిలాల్ షా, చలనచిత్రాలపై ప్రభుత్వం అజ్మాయిషీ కుతరామూ పనికిరాదని నొక్కిచెప్పారు.

ఈ సభలో ఒక విచిత్రసంఘటన జరిగింది. సభ సగం సాగినవేళకు, హఠాత్తుగా 91 సంవత్సరాల వందు ముసలి ఒకాయన వచ్చారు. ఆయన పేరు శ్రీ హరిశ్చంద్ర సఖారాం భాత్వాదేకర్.

దాదాసాహెబ్ ఫాల్కే తొలి చలనచిత్రం తీయడానికి పదిహేను సంవత్సరాల క్రితమే—1897 లో తాము ఒకచలనచిత్రం నిర్మించినట్లు ఆయన చెప్పారు.

* * *

శుక్రవారంనాడు సాజ్ సినిమాహాలులో స్త్రీల గోష్ఠి జరిగింది. సెన్సారు బోర్డులో



"రాజ్ హాత్" చిత్రంలో మధుబాల




నిజెం జెడ కాదు. సవరం జెడ. నేను చూశానులే. ఆవిడ ఓసారి మా యింటి కొచ్చి అభద్దం చెప్పింది. నాది పెద్దజెడా, నిఝం జడా అని. ఇంకోటి, అమ్మజెడ పెద్దదికాదు అందికూడా. అని నవ్వింది.

అప్పుడు నాకు ఖోపం వచ్చింది. అమ్మని ఎందుకలా అనాలి. అని. నిజెం చెప్పేయ్యాలని నిల్చున్నాను. పిన్నిగారు ఎంతసేపయినా నిజెం చెప్పడంలేదు. ఇంక ఆలీసెం అయిపోతోంది. మరి నేను ఒక్కోసారి చిన్న వెధవనిగదా. అందుకని ఆలీసెంగా నిజెం చెప్ప కూడదు.

అందుకని "కాయ్ కాయ్" అన్నా పిన్నిగార్ని చూసి.

అప్పుడు పిన్నిగారు "నోర్మూయ్" అంది.

అప్పుడు నేను "నీది నిఝంజెడకాదు, సవరం 'జెడలే' అన్నాను. అప్పుడు పిన్నిగారు నోర్మూయ్ అంది-అమ్మ నా నోర్మూయించింది. కాని-బామ్మ మంచిదిగదా.

బామ్మ పోట్లాడింది పిన్నిగారితోటి అమ్మతోటేని. చిన్న వెధవని అలా గసుర్తారేమిటమ్మా అంటూను.

అసలు పిన్నిగారికి నేనంటే కోపం. కోపమంటే భయం. నేను ఎప్పుడేనా వాళ్ళింటికెళ్తే తలుపేసేస్తుంది. నేను తలుపులోంచి వెళ్ళనుగా. కిటికీలోంచి వెళ్తానసుకో.

అప్పుడు చంపేస్తా అంటుంది నన్ను ఇలా చూసి.

యేడిశావులే అనేసి నేను పారిపోతా. మళ్ళా నన్ను పట్టుకోలేక, వాళ్ళ మొగుడితో చెప్తుంటుంది. వాడికి నేనంటే భయంలే.

నేను కనబడితే, ఇలా నవేసి, ఓ కానీ ఇచ్చేస్తాడు.

నేనంటే చాలామందికి భయంట. మరి నేను మంచివాణ్ణే. ఎందుకనో.

అంతెందుకు, మా నాన్నకీ, మా నాన్న ఆఫీసులో పనిచేసే వాళ్ళందరికీ నేనంటే భయమే. యెందుకంటే, వాళ్ళ మేనేజరు లేడూ. వాణ్ణి మానాన్నావాళ్ళూ సాయెంత్రం తిట్టుతారు. అప్పుడు వాడుండడనుకో అక్కడ.

విగ్గులేని ఎముడు అని వాడికి పేరు. పెద్ద మీసాలూ అవీ వుంటాయిగాని, నిఝం ఎముడిలా ఉండడు. నేను ఎముడిని చూశానులే. ఓ సినిమాలో.

బాగా లావుగా ఉంటాడు. మీసాలూ వాడూను. వాడికి గిరజాల విగ్గు ఉంటుందన్న మాట. పిన్నిగారి సవరంలాగ.

యేం? ఒకరోజున నాన్న నన్ను ఆఫీసుకి తీసుకెళ్ళ లేదూ. ఆవేళ ఈ ఆఫీసులో ఎముడు యెలా వుంటాడో చూద్దాం నాన్నా అన్నాను.

ఏడిశావు ఒద్దు అన్నాడు నాన్న.

కాని మరిమూడక పోతే ఎలా. అందు






# ★ బుడుగు! చిచ్చుల పిడుగు! ★

కను, ఆఫీసులో నాన్న చూడకుండా నేనే వెళ్ళాను.

ఓ గదిలో ఒకడు కూచున్నాడు. వాణ్ణి చూస్తే అస్సలు ఎముడిలా లేడు. భయం వెయ్యలేదు.

వాడు నన్ను చూసి పిల్చాడు నవ్వుతూ. తరవాత బిస్కట్టు పెట్టాడు.

అప్పుడు ఎముడంటే వీడు కాడు అనుకున్నాను. అందుకని వాడినే అడిగాను.

ఇక్కడ విగ్గులేని ఎముడు అని ఓడున్నాట్ట ఎవడురా వాడు అన్నాను.

నేనేలే అన్నాడు వాడు నవ్వుతూ.

కొయ్ కొయ్. నువ్వు కావు. మా నాన్నా ఇక్కడ సుబ్బారావుగారు, ఇంకో తలపాగా వాడూ వాళ్ళంతా ఇక్కడ నిఝం ఎముడున్నాడని చెప్పారే. అన్నాను.

"నేనే మేనేజర్ని, అందుకని నేనే ఎముడుని" అన్నాడు వాడు.

"విగ్గులేని ఎముడంటేకూడా నువ్వేనా?"

"నాకు విగ్గు లేదుగా?"

"ఎందుకు లేదు?" అన్నాను నాకు భలే జాలేసింది. ఎముడికి విగ్గులేపోతే ఎలా మరి?

మాపక్కింటి పిన్నిగారి సవరం తెచ్చి పెట్టనా అన్నాను.

ఒద్దులే అన్నాడు వాడు.

నువ్వేనా మా నాన్నావాళ్ళ ప్రాణాలు తోడేస్తున్నావుట" అన్నాను నేను.




"మీ నాన్నా వాళ్ళ ప్రాణాలు పట్రారులే తెచ్చినా గుప్పిట్లో పెట్టుకుంటారు" అన్నాడు వాడు.

అప్పుడు నాకు అవమానం వేసింది వీడు నిజెం ఎముడు కాడు అని.

అందుకని తలుపు దగ్గర కెళ్ళి, మా నాన్నని గట్టిగా పిలిచి అడిగా "నాన్నా వీడేనా విగ్గులేని నిఝం ఎముడు?" అని

అంతే. ఒకసారి నాన్నా వాళ్ళందరూ పరిగెత్తుకొచ్చాని నాకేసి చూశారు.

"వెధవా ఏమిటా వాగుడు" అన్నారు అంతట్లోకి, ఎముడుకూడా వచ్చేడు తలుపు తగ్గిరికి.

మా నాన్న హడ్డిలిపోయాడు. వాణ్ణిచూసి.

"పోడో కుర్రవెధవండి. వాడికి తెలీదు" అన్నాడు నాన్న.

'మరే' అన్నాడు ఎముడు.

"కాదు, నేను పెద్దవెధవని" అన్నాను నేను.

"ఔను" అన్నాడు ఎముడు.

"సార్ సార్. వాడిమాట వినకండి." అన్నాడు. నాన్న.

"ఏం వాడు పెద్దవాడని ఒప్పుకుంటే తప్పా" అన్నాడు ఎముడు.

"అది కాదండి. మీ సంగతి" అన్నాడు సుబ్బారావు గారు.

"నా సంగతేమిటి?" అన్నాడు ఎముడు.

"మీరు విగ్గులేనిఎముడని ఈ కుర్రాడన్నాడుచూడండీ ... అది పెద్దవాళ్ళమాట విని కాదు" అన్నాడు తలపాగా ఆయన.

"మరే మరే. వాడికే తట్టిఉంటుంది మానాడు రౌడీవెధవ" అన్నాడు నాన్న.

"నిజమే. అందుకే ఈపిల్లాడు విగ్గు కొని పెడతానన్నాడు"

"విగ్గుఇచ్చినా నువ్వు ఎముడిలా ఉండవు" అన్నాను నేను.

"మరేండి ఉండరు ఉండరు" అన్నాడు నాన్నా, తలపాగా వాడూను.

"రైటే. విగ్గుకొంటే విగ్గున్న ఎముడిలా ఉంటాను కదూ" అన్నాడు ఎముడు.

"వుండరండీ. అసలు మీరు ఎముడిలా ఉండనే ఉండరు" అన్నాడు నాన్న.

"మరే అసలు ఎముడికీ మీకూ పోలికలు లేవు" అన్నాడు సుబ్బారావుగారు.

ఎముడు నవ్వాడు. ఎముడి పోలికలు మరెవరికున్నాయట నాగ్గాక్క అన్నాడు.

అపుడేం జరిగింది తెలుసా?

వాళ్ళందరూ నావేపుతిరిగి "ఇగో ఈ పెంకి భడవకి" అనేశారు!

అప్పుడు మేనేజరు, నాన్న అందరు నవ్వేశారు. ఇంటికెళ్ళాక అమ్మకూడా నవ్వేసింది.

(ఇంకా వుంది)




# కమ్యూనిటీ ప్రాజెక్టులలో దుబారా

ఢిల్లీలో ఇటీవల ఒక వారం సెలవుల వాతావరణం ఏర్పడింది. ప్రధానమంత్రి ఎక్కడికైనా వెళ్ళినప్పుడు రాజధానిలో ఈ వాతావరణం దానంతటదేవస్తుంది. ప్రధానమంత్రి, ఆర్థికమంత్రి నగరంలో లేకపోవడమే కాదు. క్రిస్మస్ పండుగకూడా రావడంవల్ల సెలవుల సరదా ఎక్కువైంది

క్రిస్మస్ మంగళవారమైంది. రద్దయిన ఢిల్లీ రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి ధర్మమా అని ఆరోజు పచ్చిమంచి నీళ్ళు తప్ప.మరే పానీయమూ లభించలేదు. బహిరంగంగా తాగడం నిషిద్ధమైంది. అయితే ఇంట్లో ఇషం వచ్చినంత తాగొచ్చు. పెగ్గు బదులు బాటిల్ కొనుక్కుని పట్టుకుపోయి చిత్తుగా మత్తుగా, మద్యనిషేధ దేవతకు నైవేద్యంగా తాగొచ్చు. ఢిల్లీ మార్కు మద్య నిషేధం అమలులోకి రాకముందు కొద్ది కొద్దిగా నే "తీర్థం" అమ్మే రెస్టారెంటులు ఇప్పుడు సీసాలకొద్దీ అమ్మచ్చు. మనిషికి రోజుకు మూడుసీసాలకంటే ఎక్కువ అమ్మరాదని మాత్రమే నిషేధం.

ఢిల్లీ హోటళ్ళలో, రెస్టారెంటులలో, క్లబ్బులలో విందులు ('మందు' లేకపోయినా) వినోదాలూ, నాట్యాలూ వేడుకగానే జరిగిపోయాయి. చాలమంది వచ్చేముందు పూటుగా తాగివచ్చారు. కొందరు నాట్యాల మధ్యలో 'చేతులు కడుక్కుని వస్తా'మని చాటుకెళ్ళి చుక్క సుకుని చక్కా వచ్చారు.

జేబులో నాలుగు పిచికలు కిచకిచలాడే క్రిస్టియన్లు ఇంటి దగ్గరే ఉండి క్రిస్మస్ గాని, కొత్త సంవత్సరాది గాని మజాగా గడుపుతారు. మస్తుగా డబ్బులేని వాళ్ళు పస్తుఉండడం తప్ప చేయగలిగిందే ముంది? అయితే సదరు హోటళ్లలో, రెసారెంటులలో, క్లబ్బులలో క్రిస్మస్ పర్వానికి క్రీడావినోదాలలో మునిగి తేలే జనాభా ఎవరంటే క్రిస్టియన్లు కాని వారు. ఈ జనాభాలో చాలా మందికి క్రిస్మస్ అంటే జీసస్ జన్మదిన ప్రార్థన పర్వమని కూడా తెలియదు.

ఈ ఏడాది క్రిస్మస్‌కి భూలోకం శాంతంగానే ఉంది. అయితే భూలోకులలో ఒకరి కొకరికి సద్భావం మాత్రం కనబడదు. శాంతికంటె సద్భావంముఖ్యం. సద్భావం ఉంటే శాంతికంటే గొప్పదైన సామరస్యం ఏర్పడుతుంది.

## శ్రీ కృష్ణ
[ఆంధ్రపత్రిక ప్రతినిధి]

ఈ సూక్తులకేమి గాని, న్యూఢిల్లీ 'యథార్థ దృశ్యాల' కేసి దృష్టి మళ్ళిద్దాం.

ప్రస్తుతపు పార్లమెంటు అవసానదశలో ఉంది. ఫిబ్రవరి 28 ప్రాంతాల్లో గావును మరోసారి గప్పున వెలిగి చప్పున ఆరిపోతుంది. మొన్నటి సమావేశపు ఆఖరి రెండుతోజుల్లోనూ పార్లమెంటు నివేదికల వరదలో మునిగిపోయింది. నిజానికి ఈ నివేదికలన్నీ బాహాటంగా ప్రచారం కావలసిన ప్రాముఖ్యం గలవే. అంచనాల సంఘం నుంచి 9 నివేదికలు, ఆడిటర్ జనరల్ నివేదికలు, కోసీ ప్రాజెక్టుపై నివేదికలు వరసగా వరదగా వచ్చాయి. 'ఇండియన్ ఎయిర్ లైన్ కార్పొరేషన్' గూర్చి అంచనాల సంఘం కొన్ని విలువైన సలహాలిచ్చింది. ఈ కార్పొరేషన్ ప్రధాన కార్యాలయాన్ని నాగపూర్‌కు మార్చాలనీ, న్యూఢిల్లీలో దానికోసం పెద్దభవనం కట్టాలనే ఆలోచన విరమించాలనీ సిఫార్సుచేసింది. ఢిల్లీనుంచి వివిధ కార్యాలయాలను ఇతర స్థలాలకు మార్చాలని పార్లమెంటు, పారమెంటరీ సంఘాలు ఇదేవిధంగా గట్టిగా వత్తిడిచేయడం అవసరం.

## విమాన ప్రయాణాలు

ఆ నివేదికలో ఇలా ఉంది:—

"పౌరవిమానయానాలపైనా, సైనికవిమానయానాలపైనా అజమాయిషీ చేసేందుకు, ప్రభుత్వంలో ఒక విమానశాఖ ఉండాలని ఒక సూచన సంఘానికి చేరింది. పౌర, సైనిక విమానయానాల మధ్య సమన్వయం, సహకారాలుండాలని ఈ సూచనలో అంతర్యం. భారతదేశపు విమానశక్తి సైనిక విమాన బలంలో, పౌర విమానాల్లో, విమాన నిర్మాణం, విమానాశ్రయాల ఏర్పాటులో, ప్రయాణసౌకర్యాలలో ఉన్నది. వీటన్నిటి సమస్యలూ ఒకదానితో ఒకటి ముడివేసుకుని ఉన్నవి. వీ ఒకటి ప్రమాదించినా మొత్తం విమానశక్తి దెబ్బతింటుంది. అందుచేత పౌర, సైనిక విమానాలను, వాటి అవసరాలను సమన్వయంచేసి ప్రజా సౌకర్యానికి ఉపయోగించేందుకై ఆరెండూ ఒకేశాఖఆధ్వర్యంలో ఉంటం అవసరమని సంఘానికి సూచించారు.

పౌర విమానాలు సైనికంగా కూడా ఉపయోగిస్తాయని, ఇదివరలో అవసరం వచ్చినప్పుడు పౌర విమాన సంస్థలు సైనిక విమాన దళంతో సహకరించాయని అంచనాల సంఘం గుర్తించింది. అందుచేత తర్ఫీదులో గాని, కర్మాగార సౌకర్యాలలో గాని, పరిశోధన సౌకర్యాలలో గాని రెండూ సహకరించడం అత్యవసరమని సంఘం భావిస్తోంది. అయినప్పటికి ఆ రెండూ ఒకే మంత్రి అజమాయిషీలో ఉండడం ఆచరణ సాధ్యం కాదనీ, అయినప్పటికీ అన్యోన్య సహకారం

55-వ పేజీ చూడండి)

గ్రీకు పురాణగాథ:

# ప్రతిమా ప్రణయం

పిగ్మేలియన్, సైప్రెస్ ద్వీపంలో పేరు కెక్కిన శిల్పి. అతని వన్నీ మంచిగుణాలే గాని ఒకే ఒక్క దుర్గుణం: స్త్రీలంటే అతనికి సరిపడదు. అంతేగాదు: వాళ్ళంటే అతనికి పరమద్వేషం.

కాని పిగ్మేలియన్ స్త్రీలశిల్పాలే చెక్కుతూండేవాడు

ప్రపంచంలో ఉన్న స్త్రీలంతా అనాకారులే అని ఋజువు చెయ్యడానికే అతడావిధంగా స్త్రీల సొగసైన శిల్పాలు చెక్కుతూ కూర్చుంటాడని సైప్రెస్‌లో జనం అంతా అనుకున్నారు.

అతనికి స్త్రీలంటే పరమద్వేషమనీ, కనకనే వారెప్పుడూ అతనిమనస్సులో మెదులుతూంటారనీ అందుచేతనే అతడు వారి విగ్రహాలు చెక్కుతున్నాడనీ మరికొందరు గుసగుసలాడుకొన్నారు.

ఏది ఏమైనా అతడు సామాన్యంగా సుందరీమణుల శిల్పాలే చెక్కుతూండేవాడు.

ఒకనాడు పిగ్మేలియన్ మనోజ్ఞమైన మహిళాశిల్పం తయారుచేశాడు. ఆశిల్ప సౌందర్యం చూచినకొద్దీ అతనికి దానిమీద మమకారం ఎక్కువైంది. ఎక్కడా ఏలోపం లేకుండా ఆ శిల్పానికింకా బాగా మెరుగులు దిద్దాడు. అది అతని కళ్ళఎదుట మరింత అందంగా మెరిసింది.

అది చూచినవారంతా దానితో సమానమైన సౌందర్యంకలిగిన యువతి ఇంతకు ముందెన్నడూ పుట్టలేదనీ ఇక పుట్టబోదనీ అన్నారు. అలాంటిశిల్పం ఇంతకుముందెవరు చెక్కలేదనీ ఇకముందు కూడా అంతటి మనోజ్ఞశిల్పం చూడబోమనీ శిల్పులంతా అనుకున్నారు.

పిగ్మేలియన్ ఆ శిల్పానికింకా మెరుగులు దిద్ది అంతటి అందమైనశిల్పం ఇంకెవరు సృష్టించలేరనీ దానిలో సౌందర్యం ఒక పరమావధికి వెళ్ళిపోయిందనీ అనుకుని ఎంతో మురిసిపోయాడు. రాత్రింబగళ్ళత డాశిల్పసుందరికేసి చూస్తూ తన్మయుడైపోయేవాడు.

అలాగ కొంతకాలం గడిచిపోయేసరి కతడా శిల్పసుందరినే ప్రేమించాడు. ఆశిల్పం చూచినవారెవరికీ అది ఒక శిల్పమూర్తిగానే కనిపించలేదు. ఆ శిల్పి కది కేవలం ఒక స్త్రీమూర్తిగానే కనిపించింది. పిగ్మేలియన్ ఒక క్షణమైనా ఆ మూర్తి కేసి చూడకుండా ఉండలేకపోయేవాడు.

మొత్తంమీద అతనికి స్త్రీ జాతి అంటేనే పరమాసహ్యం. అయినా అతడాశిల్పానికి దాసానుదాసుడై పోయాడు.

"వినాయక"

ఒకనాడు అతడాశిల్పమూర్తి పాదాలు, పెదవులు ఆదేపనిగా ముద్దు పెట్టుకున్నాడు. గాఢంగా కౌగలించుకున్నాడు. ఇంకా తనివితీరక ఆ శిల్పాని కెన్నెన్నో రత్నాల నగలలంకరించాడు.

ఎన్ని చేసినా ఆబొమ్మ ఎక్కడా చెక్కు చెదరలేదు. అలాగే అతన్ని చూచి చిరునవ్వు నవ్వింది.

పిగ్మేలియన్ ఆశిల్పంతో సమానమైన అందమున్న అమ్మాయి నెలాగైనా సంపాదించితీరాలని శపథం పట్టాడు.

ఒకనాడు పొద్దున్నే లేచి సైప్రస్ ద్వీపంలో వీనస్ దేవాలయానికి వెళ్ళాడు. ప్రేమకు సంబంధించిన మొక్కుబడులు చెల్లించేవారంతా అక్కడికి చేరుకుంటారు.

## 2

ఆనాడు వీనస్ జన్మదినోత్సవం. ఆ దేవత సముద్ర తరంగాలలోనించి భూలోకంలో ఉద్భవించినదానాడే. గ్రీసు దేశీయులంతాలి ఆనాడా దేవతకు చిన్న చిన్న లేగల్ని బలు ఇస్తారు. ఆ లేగల కొమ్ములకు బంగారు తొడుగులు తొడిగి ఆ దేవత ఎదటికి తీసుకొస్తారు. పూజా పునస్కారాలు జరిగిన తరవాతే బలిఇవ్వడం జరుగుతుంది.

ఆనాడు సైప్రెస్‌ద్వీపం అంతటా ఆ దేవతకు పూజలుజరుగుతున్నాయి. ద్వీపం ద్వీపం అంతా ఆనాటి పూజల ధూపదీపాల పరిమళాలతో ఘుమఘుమలాడిపోయింది. సైప్రెస్ ద్వీపవాసులంతా ఆనాడా దేవతకు మొక్కుబడులు చెల్లించి తాము కలలో వలచిన యువతులంతా ఇలలో తమ కౌగిళ్ళలోకి ఒదిగిపోవాలని ప్రార్థిస్తున్నారు.

ఆనాడు సైప్రస్ యువకులంతా వీనస్ దేవతముందు సాగిలపడ్డారు అంతలో పిగ్మేలియన్ అక్కడికి వచ్చి మెల్లిగా దేవత ఎదట సాగిలపడ్డాడు. తన కోరిక ఆ దేవత ప్రమోల నివేదించుకొన్నాడు.

వీనస్ దేవత అతని పరిస్థితి కనిపెట్టి చాలా జాలిపడింది. కాని అతని శిల్పంతో సమానమైన సౌందర్యం కలిగిన వారెవరు లేరు! ఎంత గొప్పదేవత అయితేమాత్రం



పిగ్మేలియన్ ప్రతిమ

# ★ ప్రతిమా ప్రణయం ★

ఏమిచేస్తుంది. లోలోపలే చిరునవ్వులు నవ్వుకుంది.

పిగ్మేలియన్ తన ప్రార్థన ముగించి లేచి నిలబడ్డాడు. వీనస్ దేవత ఎదురుగుండా ఉండే అఖండదీపం మూడుసారులు జాజ్వల్యమానంగా వెలిగింది. అది చాలా గొప్ప శకునం. అఖండం అలాగ వెలిగిందంటే అక్కడ సాగిలపడినవారి కోరికలన్నీ ఫలిస్తాయన్నమాటే!

పిగ్మేలియన్ ఆ శకునం చూచి ఎగిరి గంతేశాడు. తిరిగి తన ఇంటికి వచ్చివేశాడు.

ఇక ఆ శిల్పసుందరితో సమానమైన సుందరి త్వరలోనే తనకు లభించగలదని సంబరపడ్డాడు.

## 3

ఆ నాటి రాత్రి యథాప్రకారంగా తన శిల్పమూర్తి ఉన్న గదిలోకి వెళ్ళిపోయాడు. కొత్తగా తెచ్చిన నగలు కొన్ని ఆ శిల్పాని కలంకరించాడు. మెల్లిగా ఆ శిల్పం పెదవులు ముద్దు పెట్టుకున్నాడు.

అంతలోనే ఆ శిల్పమూర్తి మెల్లిమెల్లిగా ఊపిరి పీల్చిన ధ్వని వినబడింది. పిగ్మేలియన్ నిర్ఘాంతపోయి అలాగే ఆ మూర్తికేసి చూచాడు. ఆ మూర్తి మెల్లిగా కదిలింది.

పిగ్మేలియన్ హడిలిపోయి రెండు మూడడుగులు వెనక్కి వెళ్ళిపోయి నిలుచున్నాడు! మళ్ళీ నిశ్చలంగా ఆ మూర్తికేసి చూచాడు. నిజంగా తాను మలిచిన ఆ మనోహర శిల్పమూర్తి కదిలింది. అతనికేసి చూచి కలకలా నవ్వింది. మెల్లిది మెల్లిగా అతని దగ్గరికి నడచివచ్చింది.

"నన్ను చూచి అలాగ నిర్ఘాంతపోతావెందుకు?"

అని ప్రశ్నించింది. ఆ ప్రశ్నతో అతని కదంతా బోధపడిపోయింది. తన శిల్పంతో సమానమైన సౌందర్యంకలవారీ ప్రపంచంలో ఎవరూ లేరు! అందుచేతనే వీనస్ దేవత ఆ శిల్పమూర్తికి ప్రాణప్రతిష్ఠ చేసింది. ఆ విధంగా తనకోరిక ఫలింపజేసింది

ఉత్తరక్షణంలో అతడామె పాదాలు ముద్దు పెటుకోబోయాడు. అలోగానే ఆ అందాలరాణి అతన్ని గుచ్చి కౌగిలించుకుంది. పిగ్మేలియన్ ఆ ఆనంద పారవశ్యంలో తాను కూడా ఒక శిల్పమూర్తిగా మారిపోతున్నానా! అని నిర్ఘాంతపోయాడు ★

### టాకీలు

"భారతదేశంలో టాకీచిత్రాలకు పాతికేళ్లు నిండాయి. ఇక టాకీలు కొత్తదశలో అడుగు పెడతాయని ఆశించవచ్చు," అని ఒక సినిమా ప్రముఖుడు అన్నాడు.

అంటే పాతసినిమాల్ని తీసుకుని వాటికే టాకీలు వేసి కొత్తవాటిని తయారుచేసేశకం ఆరంభమైందనా?

# అదృష్టం ఉండాలి

పి. విద్యాసాగర్

రాజశేఖరంగారికి జబ్బుగా వుందని టెలిగ్రాం వచ్చింది. అది చూసుకొన్న చలపతికి పిచ్చిలూ వెర్రిలూ యెత్తినాయి. వెంటనే కాకినాడ వెళ్ళటమూ లేక వూరుకోవటమూ అని సందిగ్ధావస్థలో పడ్డాడు. ఏమీ తోచక నాదగ్గరకు వచ్చాడు సలహాకోసమని. నాకు వాడు వెళ్ళటమే మంచిదనిపించింది. రాజశేఖరం గారికి ఆస్తి చాలా వున్నది. దగ్గర బంధువులు ఎవరూ లేరు. ఇప్పుడు వెంటనే వెళ్ళి ఆయనకు కాస్త ఉపచారాలు చేసి ఆయనచేత మంచి అనిపించుకుంటే అంతకంటే కావలసినదేముంది. ఆయనగారు మురిసిపోయి చలపతికి ఆస్తిలో పెద్ద వాటా యివ్వవచ్చును. వెంటనే వెళ్ళమని సలహా యిచ్చాను.

కానీ చలపతి వుత్సాహంగా లేడు. తాను యిప్పుడు తొందరపడి వెళ్ళినా ఆస్తి అంతా తనకు ఎల్లాగూ రాదు. తనలాంటి వారసులు ఆయనకు యింకా ఇద్దరున్నారు. అలాంటప్పుడు యిప్పుడు తాను హడావుడిగా వెళ్ళి డబ్బులు దండుగపెట్టుకోటం దేనికి? ఒక చెంప పదివేల రూపాయల ఆస్తి వస్తున్నా చలపతికి 'ఆదా' మీదనేదృష్టి. వస్తుతహా కాస్త జాగ్రత్తగల మనిషి! తాతగారు పోయినతరువాత వెళ్ళితే మంచిదని వాడి వూహ. కాని ఈ ఆలోచన లన్నిటికీ నేను 'బ్రేక్' వేశాను. ఇప్పుడు వెంటనే వెళ్ళకపోతే ఆస్తిలో చిల్లిగవ్వ కూడా రాదని చెప్పాను. చలపతికి ఇది నిజమేననిపించింది. అవును! అంతా అయిపోయిన తరువాత వెళ్ళితే లాభం లేదు! కనుక ముందే జాగ్రత్త పడాలి. కాని వొక సంశయం పీకుతున్నది. తనతోపాటు ఆస్తి పంచుకునే మిగతా వారసులు కాస్త నోరుగలవారు. వాళ్ళిద్దరూ కలిసి తనకు అన్యాయం చేస్తారేమో! అయినా అలా జరగాలని ఎక్కడున్నది.

నిజానికి చలపతి, రాజశేఖరంగారికి దగ్గర బంధువేమీ కాదు. చలపతి తాతకి ఆయన అన్నగారవుతాడు. వాళ్ళంతా నలుగురు అన్నదమ్ములు. రాజశేఖరంగారికి సంతానం లేదు. భార్య యిదివరకే మరణించింది. ఇకపోతే ఆయన అన్నదమ్ముల బిడ్డలు కూడా ఎవ్వరూ లేరు. వాళ్ల మనుమలు మాత్రం చలపతితో కలుపుకొని ముగ్గురున్నారు. వాళ్ళే ఆయన ఆస్తికి వారసులు.

కనుక చలపతికి ఆస్తిలో తప్పకుండా వాటా వస్తుంది. కాని వాడు వస్తుతహా అమాయకుడవటంవలన, మిగతా వారసులు వాడికి టోపీపెట్టి ఆస్తిలో పెద్దభాగం కాజేస్తారేమోనని అనుమానం వేస్తున్నది. ఏమయినా ఈవిషయంలో చలపతి చాలా జాగ్రత్తగా వుండాలి. తాతగారి మెప్పుపొందటానికి చలపతి యిప్పటినుంచీ తాపత్రయపడాలి. లేకపోతే లాభం లేదు. కనుక చలపతికి తాతగారంటే విపరీతమైన అభిమానమున్నట్లు అందరూ అనుకోవాలి దానికి కావలసినంత నటనకావాలి. తెలివితేటలుగా మెలగటం చాలా అవసరం. అయితే దానికోసము ఏమిచేయాలన్నది వాడికి పెద్దసమస్య అయికూర్చుంది.

"నాకేమిటో భయంగా వుందిరా! నువ్వు కూడా నాతో రాకూడదూ" అన్నాడు చలపతి.

"సంతోషించినట్లువుంది నీ తెలివి! నాకూ, మీవాళ్ళకూ ఏమిటి సంబంధం! నేనువస్తే ఎగ్జిబిషన్‌లో వింతవస్తువును చూసినట్లు నన్ను చూస్తారు. అయినా నీ కప్పుడప్పుడు భలే ఆలోచనలు వస్తూవుంటాయిరా"

"ఏమి చెయ్యమంటావురా! నాబుర్రకేమీ తోచటంలేదు."

"చెపుతా విను! ముందే రిహార్సల్సు వేసుకొని వెళ్ళాలి. అంటే నాటకాలలో మాదిరి "హా! తాతయ్యా! నీ కెటువంటి గతిపట్టినది" అన్నావంటే వీడు డ్రామా యాక్టరనుకుంటారు. పోతే అతివినయం ధూర్తలక్షణం కనుక అదీలాభం లేదు. కనుక నువ్వు ఈరెండింటికీ మధ్య మార్గంలో నడవాలి"

"ఏమిటిరా! నీదంతా వేళాకోళంగా వుంది"

"వేళాకోళం కాదురా! నిజంగానే! నువ్వు వెళ్ళగానే తాతయ్యా యోగక్షేమాలు కనుక్కో! ఆయనకు ఉపచారాలు నువ్వే స్వయంగా చెయ్యి! ఆయన కాళ్ళు పిసకమంటే జాగ్రత్తగా పిసుకు. అంతే కాని, ఛాన్సు దొరికిందని గొంతు పిసికేవంటే చేతికి సంకెళ్ళు తగిలిస్తారు. ఇకపోతే ఎప్పుడయినా భాగవతంగాని, భారతంగాని తీసి ఆయనకు చదివి వినిపించు! ఆయనకు ఏది యిష్టమో నీకూ అదే యిష్టమని చెప్పు! తెలిసిందా!"

"అంతా బాగానేవుంది కాని, మిగతా వాళ్లు కూడా నాతో పోటీగా ఆయనకు సేవ చేస్తామంటే నేనేమి చెయ్యాలి."

"తూర్పు తిరిగి దండంపెట్టు! యింతేనా నీ తెలివి! వాళ్ళు దగ్గరకు రాకుండా నువ్వు జాగ్రత్తపడాలి! మీ తాతయ్య దృష్టిలో నువ్వు ముఖ్యుడుగా కనిపించాలి. అందువలన నువ్వు ప్రేమంతా వొలకపోస్తూ అమోఘంగా నటించాలి."

"ఏమయినా నువ్వుకూడా వస్తే నాకు ధైర్యంగా వుంటుందిరా."

"ఎందుకు నువ్వు పోరన్ మర్చిపోతే ప్రాంప్టింగు చెయ్యటానికా! అదేమీ లాభం లేదు. నీ స్వప్రయోజకత్వం చూపించరా యిందులో! మరీ అమాయకుడవయి పోతున్నావు."

"పోనీ మా తాతయ్య పోగానే వైరిస్తాను. అప్పుడన్నా నువ్వు తప్పకుండా రావాలి."

"ఎందుకు మీరంతా ఆస్తికోసం తన్నుకుంటుంటే రిఫరీగా వుండటానికా!"

నీవంతా మరీ వేళాకోళం అయిపోతున్నదిరా! నువ్వు వస్తే కాస్త ఆస్తివిషయంలో సలహా సంప్రతింపులకు పనికొస్తావని నా ఆశ! అంతకంటే మరేంలేదు."

"అంత అవసరమొస్తే అట్లాగే వస్తానులే! దానికోసం యిప్పటినుంచీ దిగులెందుకు!"

"అయితే ఆస్తివిషయంలో తాతయ్యనేమి అడగమంటావు?"

"ఏమీ అడగవద్దు! ఆయన ఏమి యిస్తే అది తీసుకో."

"బాగుంది! ఆయన వట్టిచెయ్యి చూపిస్తే నాకేమి కావాలి!"

"[illegible]



# అదృష్టం ఉండాలి



వని పెద్దలిఘురాసి చూపిస్తే, వీడు ఆస్తి కోసం వచ్చే డనుకుంటారు, కనుక అది లాభం లేదు"

"పోనీ వొకపని చేస్తాను. 'తాతయ్యా! నాకు నీ ఆస్తిమీద ఆశలేదు. నీ ఆదరాభిమానాలుంటే నాకుచాలు' అని స్టంటు కొడతాను."

"ఇది బాగానేవుంది కానీ, ఆయన చచ్చిపోతూ ఆస్తి అంతా మిగతా యిద్దరికీ రాసిచ్చి, నీకు మాత్రం ఆదరాభిమానాలు యిస్తానంటే నువ్వు తూర్పుతిరిగి దండం పెట్టాలి"

"అలా ఎన్నటికీ జరుగదు! ఆయనకు మాత్రం నామీదే ప్రేమలేదూ! నాకు కూడా తప్పకుండా ఆస్తిలో పెద్దవాటా యిస్తాడు."

"అలా అయితే నువ్వు అనుకున్నట్టుగానే, నాటకం ఆడు! సరే! నేను వస్తాను. నువ్వు అక్కడ జాగ్రత్తగా మెలగాలి" అని చెప్పి యింటికి వెళ్ళిపోయాను.

* * *

మర్నాడు చలపతి భార్యా పిల్లలతో కాకినాడ వెళ్లాడు. అక్కడకు వెళ్లంగానే చలపతికి గుమ్మంలో మిగతా యిద్దరు వాటాదార్లు కనపడ్డారు. కనకం పలుకరించకుండా ముభావంగా వూరుకున్నాడు. జగన్నాధం చలపతి వంక కొరకొర చూశాడు. ఆ చూపులో ఆస్తి అంతా తాము కాజేద్దామనుకుంటే వీడొకడు మధ్యన వచ్చి పడ్డాడు అనే భావం వ్యక్తమయింది. చలపతి యిది లెక్క చెయ్యకుండా గబగబా లోపలకు వెళ్లాడు.

"ఏమిటి తాతయ్యా! ఎన్నాళ్ళనుంచీ జబ్బు! ముందుగా వుత్తరమైనా వ్రాయలేదు" అన్నాడు చలపతి మంచం దగ్గరకు వెళ్ళి.

'నువ్వా! చలపతి! ఇదేనా రావటం! అంతా కులాసా" అన్నాడు ముసలాయన కళ్లు తెరుస్తూ.

"కులాసాయే గానీ, జబ్బు సంగతి యిన్నాళ్లు మాకూ రాయరే దేమిటి"

"మీకు రాయటం దేనికి? పెద్ద జబ్బేమీ కాదుగదా! అదే తగ్గిపోతుందనుకున్నాను."

"ఏమయినా నాకు ముందు తెలియచేస్తే బాగుండేది. ఒక నెలరోజులు శలవుపెట్టి మే

 న్యూ ఢిల్లీ లేఖ 

( 9 వ పేజీ తరువాయి)

సాగా ఉండేట్లు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలనీ సంఘం భావిస్తోంది.

పౌర విమానయానాలకు ప్రత్యేక ప్రభుత్వశాఖ ఉండాలనే సూచనను కూడా సంఘం పరిశీలించింది. కాని పౌర విమానయానాల విషయంలో ప్రత్యేకశాఖ ఏర్పడవలసినంతగా పని ఒత్తిడి లేదని సంఘం అభిప్రాయపడింది. బ్రిటన్‌లో కూడా 1953 కు ముందు పౌరవిమానయానాలకు ప్రత్యేకశాఖ ఉండేది. కాని ఇప్పుడు రవాణాకు, పౌర విమానయానాలకు ఒకటేశాఖ ఉంది. ఈ శాఖ రైల్వేలు, వర్తక నౌకలు, కాలువలు, రోడ్డు రవాణా, హార్బర్లు, రేవులు, జాతీయ అంతర్జాతీయ నౌకా రవాణా, సముద్ర ప్రయాణాలు, పౌర విమానయానాలకు సంబంధించిన అన్ని విషయాలు అజమాయిషీ చేస్తుంది. అందుచేత పౌరయానాల పని ఏదో ఒక పెద్ద శాఖకే అప్పగిస్తే ఇప్పటికి చాలునని సంఘం భావిస్తోంది. అయితే ఈ పని ఏ శాఖకు అప్పగించాలని ప్రశ్న.

విమానరవాణా అనేది సముద్ర, నదీ రవాణాలు, రోడ్డు రవాణాలమాదిరే రవాణాకు సంబంధించిన విషయమేగాని, తంతి, తపాలా, టెలిఫోన్, వైర్లెస్ మాదిరిగా వార్తా సౌకర్యాలకు సంబంధించిన విషయంకాదు. అందుచేత దానిని రవాణా సమస్యగానే పరిగణించాలి. విమాన రవాణాకు, మిగతా రవాణాలకు మధ్య సన్నిహిత సహకారం ఉండాలి. అందుచేత బ్రిటన్‌లోమాదిరే పౌర విమానయానాలను, విమాన సంస్థలను రవాణాశాఖకు అప్పగించితే మంచిదిగాని, వార్తా ప్రసారశాఖకు అప్పగించరాదు ఈ మార్పును త్వరలో అమలుజరపడం మంచిది. అంచనాలసంఘం తమ 19 వ నివేదికలో సూచించినట్లు రవాణాశాఖను రైల్వేశాఖ నుండి విడదీసి వేరే మంత్రిత్వశాఖగా ఉంచడం కూడా అవసరం "

## కమ్యూనిటీ ప్రాజెక్టులు

కమ్యూనిటీ ప్రాజెక్టుల పరిపాలననుకూడా అంచనాలసంఘం ఇలా విమర్శించింది :

"వివిధ కేంద్రాలలో వేర్వేరు అంశాలపై ఖర్చుపెట్టిన దానికి తగినంతగా అభివృద్ధి జరిగిందో లేదో అంచనా వేసేందుకు అనువైన ఏర్పాటేమీ కేంద్రంలోగాని, రాష్ట్రాలలోగాని లేదని సంఘం అభిప్రాయపడుతోంది. మామూలుగా జరిగేపనిని ఆయా కేంద్రాలు కమ్యూనిటీ ప్రాజెక్టు అధికారులకు నివేదించడానికి మాత్రమే ఏర్పాట్లు అమలో ఉన్నాయి. కేంద్రప్రభుత్వపు ఆదేశాలు సరిగ్గా అమలు జరుగుతున్నాయో లేదో చూడడానికి కమ్యూనిటీ ప్రాజెక్టు అధికారులు కొన్ని కొన్ని చర్యలు తీసుకున్నందుకు అంచనాలసంఘం సంతోషిస్తున్నది. అయితే ఈ చర్యలన్నీ మొత్తంమీద పని ఎలా జరుగుతోందో పరిశీలించడానికి ఉపయోగపడతాయే తప్ప సరిగా ఎంతపని జరిగిందీ, ఖర్చుకు తగిన ఫలితాలు లభించాయా అని లెక్క వేయడానికి పనికిరావు.

అందుచేత పార్లమెంటు ఆమోదించిన వ్యయధనం సరిగ్గా ఖర్చయిందా, తగినంత పని జరిగిందా అని కచ్చితమైన లెక్కలు వేయడానికి తగిన ఏర్పాట్లులేవని సంఘం భావిస్తోంది. అందుకు ఏమేమి ఏర్పాట్లు చేస్తే బావుంటుందో కమ్యూనిటీ ప్రాజెక్టు అధికారులు ఆలోచించాలి."

## అవకతవకలు

రాజస్థాన్ అక్కౌంటెంట్ జనరల్ పేర్కొన్న "అవకతవకలను" గూర్చి ప్రస్తావిస్తూ అంచనాల సంఘం ఇంకా ఇలా అన్నది :- "ఇతర ప్రదేశాలలో కూడా ఇలాంటి అవకతవకలు జరిగాయేమో తెలియదు. జరిగితే ఎంతవరకూ జరిగాయో తెలియదు అవకతవకలు జరిగినంతమేరా, ధనం వృథా అయినట్టే భావించాలి. అసలు కమ్యూనిటీ ప్రాజెక్టులలో ప్రజలు చేసిన శ్రమను, పెట్టినడబ్బును ఎక్కువచేసి చెబుతున్నారని కొందరు భావిస్తున్నారు. తప్పుడులెక్కలు చూపుతున్నారని, ప్రభుత్వంనుంచి ఎక్కువ డబ్బు లాగడంకోసం మోసంచేస్తున్నారని ఆరోపణలున్నాయి. ఈ విషయమై నిర్ణయించడానికి అంచనాల సంఘంవద్ద తగినన్ని సాక్ష్యాధారాలు లేవు. రాజస్థాన్ అక్కౌంటెంట్ జనరల్ పేర్కొన్న అవకతవకలవల్ల కొంతవరకూ అసలుసంగతి గ్రహించవచ్చు. పై ఆరోపణలు అతిశయోక్తులు కావచ్చును. కాని వాటిని పూర్తిగా త్రోసేయడానికి వీలేదు. ప్రజాధనాన్ని పైనచెప్పినరీతిగా దుర్వ్యయంచేయకుండా అరికట్టే పద్ధతులింతవరకూ లేవు. కనుక కమ్యూనిటీ అభివృద్ధి కార్యక్రమానికి సంబంధించిన ఈ అంశానికి అంచనాలసంఘం ప్రథమ ప్రాధాన్యం ఇస్తున్నది. అసలు అక్కౌంట్లు తయారు చేయడంలో కనీసపు ప్రమాణాలను కూడా పాటించడంలేదని ఈ సందర్భంలో సంఘం భావిస్తోంది. ఈ లోపాన్ని వెంటనే ఎందుకు సవరించరాదో తెలియడంలేదు ఈ ప్రాజెక్టుల ఉన్నతాధికార సంఘం ఆయా విషయాలన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించాలని అంచనాల సంఘం గట్టిగా కోరుతున్నది. కమ్యూనిటీ ప్రాజెక్టులలో పనిచేసే ఉద్యోగులు, పనివారు డబ్బు విషయంలో జాగ్రత్త వహించేటట్లు, అక్కౌంటింగ్ పని సరిగా చేసేటట్లు చూడవలసిన అవసరం ఎంతైనా ఉంది అలా చేయక పోయినప్పుడు తక్షణం ఆ లోపాలను నివారించడానికి సమర్థమైన చర్యలు కూడా తీసుకొనే ఏర్పాట్లు చేయాలి. గ్రామాల అభివృద్ధికి కేటాయించిన ధనాన్ని పవిత్రంగా భావించాల్సిన అవసరాన్ని అంచనాల సంఘం ఉద్ఘాటిస్తోంది ఆ ధనం దుర్వ్యయం కాకుండా తగిన కఠిన చర్యలు తీసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వంమీదకూడా ఉంది."

* * *

భారత ప్రభుత్వ నియామకంలో మొత్తం 247 మంది ఐ. ఏ. ఎస్. అధికారులున్నారని అంచనాలసంఘానికి సమాచారం అందింది. వీరిలో 139 మంది సెక్రటరీ, జాయింటు సెక్రటరీ హోదాలోనివారు. 94 గురు డిప్యూటీ సెక్రటరీ హోదావారు. 14 గురు అండర్ సెక్రటరీలు. రాష్ట్రాలవారీగా చూస్తే ఉత్తరప్రదేశ్‌కు చెందినవారు 68 గురు, మద్రాసువారు 27 గురు, పశ్చిమ బెంగాల్ వారు 26 గురు, బొంబాయినుంచి 22 మంది, మధ్యప్రదేశ్ నుంచి 22 మంది బీహారునుంచి 18 మంది, పంజాబునుంచి 17 మంది ఉన్నారు. భాషలవారీగా చూస్తే 42 మంది హిందీకాని ప్రాంతాలనుంచివచ్చినవారున్నారు. వీరిలో మద్రాసువారు 27 గురు, ఆంధ్రనుంచి 9 మంది, కేరళనుంచి 3 గురు, మైసూరునుంచి 3 గురు ఉన్నారు. ★

## ★ మనసైన ముచ్చట ★

[48 వ పేజీ తరువాయి]

కల్లబొల్లి ఊసులు కూడ లేవుసుమండీ! మరావి డెలా అనుకుందో! "అతను మీ..." అన గానే మా అన్నయ్యండీ అన్నా చటు క్కున చదవడం ఆపేసి. ఆవిడ ముఖం చిన్న పోయింది తన లెఖ్క తప్పు అయినందుకు.

ఇంతలోకి మరో బండి దిగి ఒక అమ్మాయి అబ్బాయి వచ్చారు సరాసరి మేం వున్న రూముకే. అతను ఆ అమ్మాయిని ఆ రూములో విడిచిపెట్టి తను ప్రక్కరూము లోకి వెళ్ళిపోయేడు. తరవాత దువ్వెన, అద్దం టవల్ ఇలా ఏవో అతనికి కావలసిన సామాన్లు తీసుకు నేందుకు ఆ రూముకి 3, 4 సార్లు వచ్చి ఆ అమ్మాయితో మాట్లాడి వెళ్ళి పోయేడు. ఇదంతా అయేక ఆ అమ్మాయిని కూడ కుశలప్రశ్నలు వేసిం దావిడ. ఇంతలోకి మళ్ళా వచ్చేడా అబ్బాయి దేని కోసమో? అతను వెళ్ళేక అతను మీ అన్నయ్యా? అనడిగిం దావిడ. కాదండీ మా ఆయన అందా అమ్మాయి పాపం! సిగ్గు పడుతూ. నా దగ్గర జరిగిన తారుమారే జరిగిం దావిడకి అక్కడ కూడా!

ఒక అమ్మాయి, అబ్బాయి సినీమాకో, బీచికో వెళ్ళినా, లేక ప్రయాణం చేసినా వాళ్లిద్దరూ భార్యా, భర్తలే అనుకుంటారు సాధారణంగా. అనుకుంటే పోయేదిలేదు. కాని చటుక్కున అడిగేస్తారు చాలమంది. ఆ వెళ్లేవాళ్ళు ఏమవుతారో తెలియకపోతే వచ్చే నష్టమేమిటి? పోనీ కావాలే అను కోండి. మీ రిద్దరూ ఏమవుతారు? అనడిగితే ఎంతో సబబుగా వుంటుంది, అవతలివాళ్ళ మనసు కూడా కష్టపడదు. మంచివాళ్లయితే వూరుకుంటారు, కాని అదే మరోకళ్ళయితే అనవసర ఘర్షణ.

పి. నీలవేణి

జార్నగూడ (హైదరాబాదు)

*     *     *

నా అత్త స్నేహితురాండ్రలో ఒకరైన సుజాత చెబుతూండేది కలెక్టరుగార మ్మాయి నీరజకి తగని గర్వమనీ, ధనం, అందం, హోదావల్ల ఎవ్వరినీ లెక్క చెయ్య దనీని. తియ్యగా, కోయిలవలె మధురంగా పాడతానని నళినికి భలే తలబిరుసనికూడా సుజాతే చెప్పింది నాతో.

సుజాత మాటలు నమ్మకుండా వుండడ మెలా? కారణం ఆమె నా ఆప్తమిత్రురా లని చెప్పనే చెప్పాను. అంతేకాకుండా సుజాత, నళినితీరుకూడా అక్షరాలా అవిధం గానే వుంది. ఎప్పుడు ఆప్యాయంగా పలుక రించినా ముక్తసరిగా రెండు, మూడు మాటలకంటె ఎక్కువ మాట్లాడనే మాట్లా డరు. ముత్యాలూలికిపోతాయేమోనన్నట్లు. పోన్లే. వాళ్ళ గొప్ప వాళ్ళకే వుంటుంది. నాకేం తక్కువా అని నేను మాట్లాడడం మానేశా. అంతే? ఎప్పడూ కాలేజీలో మేము ఎడముఖం పెడముఖమే కాని కులా సాగా మాట్లాడుకున్న పాపాన పోలేదు.

ఆరోజు మేమంతా పిక్నిక్కి ప్రోగ్రాం వేసుకుని పార్కుకు బయలుదేరాం. మధ్యా హ్నాం 2 గంటలనుండి సాయంత్రం వరకు చాలా విరివిగా ప్రోగ్రాములు వేసుకున్నాం. మాతో నీరజ, నళినికూడా వచ్చారు. ఆ నాడు వారిద్దరిని చూస్తే నాకు విపరీతమైన ఆశ్చర్యంతోపాటు నా అభిప్రాయాన్ని కూడా మార్చుకోవలసివచ్చింది. కలెక్టరుగా రమ్మాయి నీరజకి గర్వమూ లేదు. ధనం, అందంవల్ల దర్పమూ లేదు, కాకపోతే హోదావల్ల ఏర్పడిన హుందాతనం, దర్జా మాత్రం అడుగడుగునా వుట్టిపడుతుంది. ఆమె మాట్లాడే తీరే అంత. చాలా తక్కు వగా మాట్లాడుతుంది. ఇంక నళిని కూడా అంతే! పదిమందిలో వుత్సాహంతో ఎన్ని పాటలైనా పాడుతుంది. కాని ఒంటరిగా వున్నప్పుడు నోరైనా మెదపదు.

మరి సుజాత నాతో ఎందుకట్లా చెప్పింది? ఆమెకి నీరజని, నళినిని చూస్తే ఈర్ష్యా? లేక పగా? ఏమీ కాదు. వాళ్ళ మన స్తత్వాల నర్థంచేసుకోకపోవడమే దీనికి కారణం. తనూ నావలెనే ఎవళ్ళో గర్వమని చెబితే నమ్మివుంటుంది. యథార్థం తెలుసుకో కుండా అమాటే నాతోకూడా చెప్పి వుంటుంది. అంతేకాని ఆమె వాళ్ల నర్థంచేసు కోవడానికి ప్రయత్నించినట్లు కనబడదు.

మనుష్యుల్లో ఒక్కొక్కళ్ళ కొక్కొ క్కరకం మన స్తత్వం, ఒక్కొక్కతీరూ— తెన్నూ వుంటుంటాయి. మనం సూక్ష్మంగా నిరీక్షించి తెలుసుకున్న తర్వాతనే నిర్వ చనం చెప్పటానికి పూనుకోవాలి. ఇతరుల చెవులతో, కళ్ళతో విని, చూచి దేనికైనా నిర్వచనం చెప్పడంవల్ల చాలా అనర్థాలు కల్గుతాయి. "ఇతరులనుగురించి నీకేమీ తెలి యదు గనుక మంచిచెడ్డలు విచారించక ఎవ్వరినీ విశ్వసించకు. లేకపోతే అది నీకు ప్రపంచకంలో సగంమందిని శత్రువులుగా తయారుచేస్తుంది" అని చెప్పిన హేజ్లిట్ మాటలు జ్ఞాపకమొచ్చాయ్ నాకు.

ముదిగంటి అనసూయ.

తణుకు.





## మారిన మతలబు

(26 వ పేజీ తరువాయి)

కాదు, తెలియని భాషతో వేగలేక" అని సమాధాన పరచుకున్నాను.

"నువ్వలా బాధ పడతావనే అరవం, తెలుగు రెండూ తెల్సిన పనిమనిషిని కుది ర్చాను శశీ! చక్కగా ఆభాషకూడా ఆమె ద్వారా నేర్చుకోవచ్చు. ఏముంది కొద్ది రోజుల్లోనే అలవాటయిపోతుంది అంటూ దగ్గరకు లాక్కోబోయారు నన్ను. వారి ప్రయత్నం కొనసాగించకుండా చేయ డానికి పనిమనిషి నెపమయింది నాకు.

ఆ రాత్రి ప్రొద్దుటినుంచి జరిగిన విచిత్ర సంఘటనలు, ఆలోచనలు వారితో చెప్పాను. నా వూహలకు వారు నవ్వుతారని తెలుసుకొని, చెప్పకుండా వుండలేక పోయాను.

కాలం గడచిపోయింది. నాకు తమిళం వంటబట్టింది. అప్పుడే మావారి దృష్టిలో పండితురాల నయ్యాను.

ఆనాడు ఆఫీసునుంచి వస్తూనే తెలు గులో కవిత్వం ప్రారంభించారు. మద్రాసు నుంచి హైదరాబాదు పోబోతున్నామట.

ఆఫీసుకు శెలవు లిచ్చినా వారికి పని వుం టుందట. అందుకనే నన్ను ఒకసారి మా అమ్మగారింటికి పంపుతామన్నారు.

"అప్పుడు అతి కష్టంమీద అరవం నేర్చావు. ఇక హైదరాబాదు వెళ్ళాక తల బాదుకుంటూ తురకం నేర్చుకోవలసి వస్తుం దేమో !" అన్నారాయన నవ్వుతూ.

"అదంతా తర్వాత ఆలోచించుకుందాం గాని, పాపం నిన్నుచూడక మీ వాళ్లు, వాళ్లని చూడక నువ్వూ దిగులుపడడం దేనికి? మీ అమ్మగారింటికి రేపు తీసుకువెళ్తాను. ప్రయాణం కా...ఓహో ఇప్పుడు వెళ్తే యింక నాలుగైదు నెలలవరకు రావన్న మాట. మరిచేపోయాను. అంతవరకు తిరిగి బ్రహ్మచర్యం స్వీకరించవలసిందే నా దేవీ?" అంటూ చిలిపిగా నాకళ్ళలోకి చూచారు. అవునన్నట్లు తల వూపక తప్పిందికాదు నాకు...



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



మధురవీరన్న అశ్వరాజం [మధురశిల్పం]

ఫొటో: వి. కేశవశర్మ.



# శ్రీరామరక్ష



ఆశిద్దాము. శ్రీ పటాస్కర్ మహాత్మ్యం చివరకు ఎలా పరిణమిస్తుందో చూడాలి.

*　　*　　*

"ఉపాధ్యాయ వృత్తి మహోత్కృష్టమైనది. అజ్ఞానాంధకారాన్ని నిర్మూలించడంలో వారు అఖండమయిన సేవ చేయవలసి వున్నది" అన్నారు రాష్ట్ర విద్యామంత్రి ఈ మధ్య నల్గొండ జిల్లా ఉపాధ్యాయ పరిషత్తును ప్రారంభిస్తూ. నేటి వర్తమాన సమాజంలో ఉపాధ్యాయుల ప్రతిపత్తి ఎంత ప్రధానమయినదో, వారు నిర్వహించవలసిన బాధ్యతలు అంత గురుతరమయినవని అందరూ అంగీకరించే విషయమే. బాధ్యతలు పెద్దవి కాబట్టి, వాటికి తగిన వేతనాలు ఇప్పించండి మహాప్రభో అని ఉపాధ్యాయులు పాలకులకు ప్రతి సమావేశంలోనూ ప్రాధేయపడి విన్నవించుకుంటున్నారు. అయినా రాష్ట్ర ప్రభుత్వం వీరి మొరను ఆలించిన పాపాన పోవడం లేదు. ఉపాధ్యాయ వృత్తిలో వున్నవారికి పింఛను, ప్రావిడెంటు ఫండు మొదలయిన సౌకర్యాలను కలిగించడంలో ఇరుగున వున్న మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ఎంత ఉదారమయిన విధానాన్ని అనుసరిస్తున్నదో కూడా ఆంధ్ర ప్రభుత్వం గమనిస్తున్నట్లు లేదు. తక్కువ జీతాలు వచ్చే ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపునకు ఇప్పట్లో అవకాశం లేదనే రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటికీ వాదిస్తున్నది. అదనపు ఆదాయ మార్గాలను అన్వేషిస్తేనే గాని, జీతాలు పెంచే సావకాశం లేదని చెబుతున్నది. బాలబాలికలను ఉత్తమమైన భావిపౌరులుగా తయారు చేయడంలో గురుతరమైన బాధ్యతలను ఉపాధ్యాయులు నిర్వహించక తప్పదని ఒకవైపు ధర్మపన్నాలు చెబుతూ, మరొకవైపు ఎక్కువ వేతనాలు ఇవ్వడం మాత్రం సాధ్యపడదని వాదించడం రాష్ట్ర ప్రభుత్వ హ్రస్వ దృష్టికి నిదర్శనమనే అనిపించుకుంటుంది. ఉపాధ్యాయుల జీతాలు పెంచడానికి అయ్యే ఖర్చులో సగభాగం భరిస్తామని, మిగతా సగభాగాన్ని మాత్రమే రాష్ట్రాలు భరించాలనీ కేంద్ర ప్రభుత్వం ఇదివరకే మాట ఇచ్చింది. అనేక ఇతర రాష్ట్రాల ప్రభుత్వాలు కేంద్ర ప్రభుత్వ ప్రతిపాదనను ఆమోదించి ముందంజ వేసినవి. ఆంధ్ర ప్రభుత్వం మాత్రం 'దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడనే' ధోరణిలోనే ప్రవర్తిస్తున్నది. కేంద్ర ప్రభుత్వం చేసే సహాయం కేవలం మొదటి సంవత్సరానికి మాత్రమే వర్తిస్తుందో, లేక, ప్రతి సంవత్సరానికీ వర్తిస్తుందో ఆంధ్ర ప్రభుత్వానికి ఇప్పటికీ అర్థం కాలేదట! కేంద్ర ప్రతిపాదన ప్రకారం ఉపాధ్యాయుల జీతాలు పెంచలేక పోవడానికి ఈ సందేహమే కారణమట! కేంద్ర ప్రతిపాదన రాష్ట్రాలకు అంది దాదాపు ఏడాది అయినా, ఈ స్వల్ప సందేహాన్ని ఆంధ్ర ప్రభుత్వం ఇంతకాలంగా నివృత్తి చేసుకోలేక పోయిందంటే ఏమనాలి?

తెలంగాణాలో ఇస్తున్న వేతనాలతో సమానమైన వాటిని ఇస్తేనే తప్ప, ఆంధ్ర ఉపాధ్యాయ లోకంలో అశాంతి చల్లారదు; అప్పుడుగాని వారు విశ్రమించరు.

*　　*　　*

తెలంగాణా చేనేత కాంగ్రెస్‌ను ఆంధ్ర చేనేత కాంగ్రెస్‌లో విలీనం చేయడానికి హైదరాబాదు చేనేత స్థాయి సంఘం శ్రీ కొండా లక్ష్మణ్ అధ్యక్షతన సమావేశమై నిర్ణయించింది. ఉభయ ప్రాంతాలలో వున్న ఆయుర్వేద సంఘాల విలీనం కూడా జరుగబోతున్నది. శుభం. రెండు రాష్ట్రాల కాంగ్రెస్ సంఘాలు విలీనం గాకపోయినా, కనీసం చేనేత కాంగ్రెస్‌లైనా విలీనమవుతున్నందుకు హర్షించని ఆంధ్రుడుండడు. ఉభయ ప్రాంతాల చేనేత కాంగ్రెసులు వడువు, పేకగా కలిసిపోయి వర్ధిల్లాలి; తమ కోర్కెలను కలసికట్టుగా వ్యవహరించి సాధించుకోవాలి.

31-12-56　　—[భార్గవ]



పూర్ణాపిక్చర్స్ అధినేత శ్రీ జి. కె. మంగరాజు షష్టిపూర్తి (విజయవాడ) ఉత్సవంలో తీసినఫొటో. ఈ సందర్భంలో రెండువేలమందికి అన్నదానం జరిగింది. పూర్ణా ఉద్యోగులకు వస్త్రాలు బహూకరించారు. ప్రేమసమాజానికి వెయ్యిరూ. ల విరాళంఇచ్చారు.



# బుడుగ!
# చిచ్చులపి

బెల్లించడం అంటే, నువ్వు బంగారుతండ్రి కదమ్మా, నువ్వు బాచాల కొండవి కదమ్మా అనేసి మనదగ్గర బొమ్మలు, జంతికలూ, గోళీలూ, నా వుండీలో వుండే డబ్బులూ అవన్నీ లాక్కోడం అన్న మాట.

మనం ఇవ్వను అంటాం అనుకో అప్పుడు ఘుబుక్కున "బోడివెధవా" అని తిట్టడం.

అప్పుడుకూడా ఇవ్వకపోతే అల్లదుగో కాకి అటుచూడు అనేసి, మనం అటు చూస్తూఉంటే, తీసేసుకుంటారు.

దీన్ని టోకరా అంటారని బాబాయి చెప్పాడు. టోకరా అంటే కూడా అబద్ధం చెప్పడమే.

అంటే, ఇప్పుడు నాదగ్గర వుండీ వుందికదా. అందులో డబ్బులు వుంటాయి కదా. డబ్బులుంటే వుండీ బరువుగా ఉంటుంది. లేకపోతే తేలికగా ఉంటుంది. చప్పుడు అవదు. ఒక్కోసారి కొంచెం కాణీలు వుంటే, చప్పుడు అయినా, బరువుగా వుండదు గదా.

నా వుండీ వుండుండి తేలికగా అయిపోతుంది. ఇది ఎప్పుడంటే నాన్నకి జీతం రానప్పుడు అన్న మాట. అప్పుడు మనం ఎందుకు వుండీ తేలికగావుందీ అంటామనుకో.

ఏమో అంటుంది అమ్మ. నాన్న కూడా ఏమో అంటాడు. హాచ్చర్య పడిపోయేస్తాను. కాని బాబాయి నిజెం చెప్తాడు. కొంచెం రోజులు అయ్యాకా.

ఏమిటంటే. నాన్న దగ్గర డబ్బులు అయిపోతే, నేను నిద్దర పోయినప్పుడేమో, నా వుండీలో డబ్బులు అప్పు తీసుకుంటారుట. మళ్లీ డబ్బులొచ్చాక అందులో ఆ అప్పులు వేసేస్తారుట. అప్పుడు వుండీ మళ్లీ బరువుగా వుంటుంది.

ఏం? మరి బాబాయి ఇలా అని నాకు ముందస్తుగా ఎందుకు చెప్పడు? ఆలీసెంగా చెప్తాడుగదా.

ఇలా ఆలీసెంగా నిజెం చెప్పినా అబద్ధమే అన్నమాట.

ఇలాంటి నిజం ఎప్పుడేనా పెద్దవాళ్లే చెప్తారు. చిన్నపిల్లలు ఆలీసెంగా నిజం చెప్పకూడదట. చెప్తే తేంజరు.

తేంజరు అంటే, పిన్నిగారూ మా బామ్మ పోట్లాడుకోడం.

ఇప్పుడు పిన్నిగారుందికదా, ఆవిడకి పెద్దజెడ లేదుకదా. అయినా, పేరంటంలో కూచుని అబద్దం చెప్పేస్తుంది. అప్పుడు పెద్ద జెడ ఉంటుంది అను అనుకో. అయినా అది





# నూతన సంవత్సరములో ఒక **నేషనల్-ఎక్కో** రేడియోను కొని సంగీత మాధుర్యమును అనుభవించండి!

దేశమంతటా లక్షలాది కుటుంబములు నేషనల్-ఎక్కో రేడియోద్వారా పొందే సంగీతము మరియు వినోదముల క్రొత్తప్రపంచములోని ఆనందమును మీరూ పొందండి!

ఎంచుకుందుకు 12 దివ్యమైన మోడలులు

నేషనల్-ఎక్కో రేడియోలు అద్భుతమైన సేవ యిచ్చుటకు పేరు గాంచినవి.

మోడలు 241: సుందరమైన ప్లాస్టిక్ క్యాబినెట్: భారత దేశములోని అన్ని స్టేషనులను వినవచ్చును; ఎ సి/డి సి కరెంటు లేక డ్రై బ్యాటరీతో పని చేయును. దీని ధర రు. 195/- మాత్రమే!

ఇంకా యితర 11 ఘనమైన మోడలులు రు. 1200/- వరకు వివిధ ధరలలో ఉన్నాయి. ఒక నేషనల్-ఎక్కో రేడియోను నేడే కొనండి. సులభమైన వాయిదాల పద్ధతిలో కొనవచ్చును!

మోడలు 241: ఈ మోడలులో ఉన్న 5 వాల్వులు గల రేడియో ఎసి/డిసి కరెంటుతో పని చేయును; 4 వాల్వులది డ్రై బ్యాటరీతో పనిచేయును. ఆకర్షణీయమైన ప్లాస్టిక్ క్యాబినెట్; మీడియమ్ వేవ్ బ్యాండు మరియు 19, 31, 41, 60 మరియు 80-90 మీటర్ల షార్ట్ వేవ్ బ్యాండులపై విన వచ్చును. రు. **195/-**



మోడలు ఎ/317; 7 వాల్వులు- 8 బ్యాండులు; 13, 16, 19, 25, 31 మరియు 41 మీటర్లు బ్యాండ్ స్ప్రెడ్ చేయబడినవి - ట్యూన్డ్ ఆర్. ఎఫ్. స్టేజి; కర్ర క్యాబినెట్; ఎ సి కరెంటుతో పనిచేయును. రు. **585/-**

పై ధరలలో బేరము లేదు; స్థానిక పన్నులు అదనము.



# నేషనల్-ఎక్కో

రేడియోలు శ్రేష్ఠమైనవి - అవి ట్రాపికలైజ్ * చేయబడినవి.

ఉచితము: ఏ నేషనల్-ఎక్కో వ్యాపారియైనా రేడియో ఉచితముగా పెట్టిచూపమని నేడే వినండి! లేక, ఉచితముగా పంపే బొమ్మలతో వివరించిన కాగితమును పంపమని మాకు వ్రాయండి.

జెనరల్ రేడియో & అప్లయన్సెస్ ప్రైవేట్ లి. ఒపేరా హౌస్. బొంబాయి 4. 8 మదన్ స్ట్రీట్, కలకత్తా 13. 1/18 మౌంట్ రోడ్, మద్రాసు. 36/79 సిల్వర్ జూబ్లీ పార్క్ రోడ్, బెంగుళూరు. జోగ్దియాన్ కాలనీ, చాందనీ చౌక్, ఢిల్లీ.





* భారతదేశము వంటి ఉష్ణ దేశములలో బాగుగా పనిచేయుటకు మామూలుగా జరుపుతున్న కన్న 16 సార్లు ఎక్కువ సురక్షితముగా చేయబడినవి.

# మృత్యు దేవత

పూర్వకాలంలో అమరావతీ నగరంలో ముగ్గురు స్నేహితులుండేవారు. వారు ముగ్గురూ చాలా కలిసిమెలిసివుంటూ, ఏ పని చేసినా ముగ్గురూ కలిసిచేసేవారు.

వారు చేయని పనంటూ లేదు. దోపిడీలు, హత్యలూ లెక్కకుమించి చేశారు. సంపాదించిన ధనమంతా హాయిగా తీరుబడిగా కూర్చుని ఖర్చుపెట్టుకుంటూ కాలక్షేపం చేసేవారు. వీరికోసం ఎంతమంది గాలించినా దొరకలేదు.

ఒక రోజున వీరు ముగ్గురూ కూర్చుని ఏదో మాట్లాడుకొంటూ ఉండగా, కొంతమంది కలసి శవాన్ని తీసుకుపోడం గమనించారు. వారికి అదేదో తెలుసుకోవాలనే కోరిక కలిగింది.

వెంటనే తమ నౌకర్ని పిలిచి అదేమిటో తెలుసుకొనిరమ్మని అడిగారు. అతను అటు వెళ్లకుండానే దాన్నిగురించి తనకు తెలుసునని చెప్పడం మొదలుపెట్టాడు.

"ఆ నగరంలో ఒక దుర్మార్గుడుండేవాడు. వాడు అందర్నీ పీడించుకుతిని, వారిమీదనే ఆధారపడి జీవనం గడిపేవాడు. వాడికి నేటితో యీలోకంలో పనిపూర్తయినట్లుగా మృత్యుదేవతనుంచి పిలుపు వచ్చింది. అందుకోసం అతను బయలుదేరి వెళ్లిపోతున్నాడు"—అని ఆగిపోయాడు.

"వెళ్లకపోతే-?" అని ప్రశ్నించాడు వారిలో చిన్నవాడు.

"ప్రతిసృష్టి ఎప్పుడో ఒకప్పుడు

"పారిజాత"

మృత్యు దేవతను దర్శించుకోవలసిందే. వెళ్ళినవాడు యిక తిరిగి రాడు కూడ"-అని చెప్పి వెళ్ళిపోయాడు నౌకరు.

దాంతో వీరిముగ్గురికి భయం కలిగింది. తాముకూడా మృత్యుదేవత కోసం వెళ్లాలికదా అని తలుచుకొనేసరికి ఎందుకో అదోరకమైన భయం ఆవరించింది. "ఈ మృత్యుదేవతేకనక లేకపోతే—" అనే ఆలోచన కలిగేసరికి - వారి భయం పటాపంచలై పోయింది. సంతోష రేఖలు వెల్లివిరిశాయి వారి ముఖాల్లో.

వెంటనే మృత్యుదేవత కోసం బయలుదేరారు ముగ్గురూ కలిసి. చాలా దూరం నడిచారు. కాళ్ళు అరిగిపోయేట్లుగా నడిచారు కాని వారికోరిక తీరలేదు. కొంతదూరం పోయేసరికి ఒక ముసలితాత వారికి ఎదురయ్యాడు.



నేనూ, తమ్ముడూ

ఫోటో: [illegible]

# మృత్యు దేవత

"మృత్యు దేవత ఎక్కడుందో చెబుతావా లేకపోతే నిన్ను యిల్లాగే చంపెయ్యమన్నావా?" అని అడిగారు. పాపం! ఆ తాత పని "బోనులో ఎలుక" మాదిరిగా వుంది. ఎంతో ప్రాధేయ పడ్డాడు తనకు తెలీదని. కాని వారు తమ పట్టు విడువలేదు.

"అయితే వినండి"-అని చెప్పడం మొదలెట్టాడు—"ఇల్లాగే కొంత దూరం పోయేసరికి మీకు ఒక పెద్ద మర్రిచెట్టు కనబడుతుంది. ఆ చెట్టు తొఱ్ఱలో దాగి వుంది మృత్యు దేవత-వెళ్ళి చూసుకోండి వెంటనే"

ఈ మాటలు వినేసరికి వారి సంతోషం పరవళ్ళు తొక్కింది. ఆ తాతను అక్కడే వదలిపెట్టి ఆ మర్రిచెట్టు కోసం బయలుదేరారు.

నిజంగానే మర్రిచెట్టు కనబడింది. ఇక మృత్యుదేవతను పట్టుకొన్నామనే అనుకొన్నారు. తీరా చేసి ఆ తొఱ్ఱలోకి తొంగిచూసేసరికి వారికి కనబడిందల్లా ఒక పెద్ద ధనరాశి.

ధనరాశి చూడగానే వారు మృత్యుదేవత మాట మర్చిపోయారు. ఆ ధనమంతా ముగ్గురూ పంచుకోడానికి నిర్ణయించుకొన్నారు. కాని అది పగలు. ఈ వెలుగులో ఈ ధనమంతా తీసుకుపోతే ఎవరేనా చూస్తారేమోనని అనుమానం కలిగింది. చీకటి పడే దాకా అక్కడే వుండి - ఆ తరువాత ఆ ధనాన్నంతా మోసుకుపోడానికి నిశ్చయించుకొని- యీలోగా కాలక్షేపం కోసం మూడోవానిని ప్రక్కనే ఉన్న పట్టణంలోకి పోయి "సారా" సీసాలు తీసుకురమ్మని పంపారు.

అతను అటు పట్టణంలోకి పోగానే వీరికి మరో ఆలోచన కల్గింది. పట్టణంనుంచి రాగానే ఆ మూడోవాణ్ణి చంపేస్తే యీ ధనమంతా రెండు వాటాలే వేసుకోవచ్చని-అప్పుడు యింకా ఎక్కువ ధనంకూడా వస్తుందని. ఇది నచ్చింది వారిరువురికీ.

కాని పట్టణంలోకి వెల్లిన వాడు మాత్రం తక్కువ తిన్నాడు గనుకనా వీరి వల్లో పడ్డానికి. అతను మరొక ఎత్తు వేశాడు. బజారుకు పోయి—"కాలకూట విషం" కొని - దానిని రెండు సీసాలలో కలిపి - తనకోసం ప్రత్యేకంగా ఒకటి మంచిది తెచ్చుకొన్నాడు ఆ విషం కలిపిన సారా త్రాగి వెంటనే వారిరువురూ చనిపోతే ఆ మొత్తం ధనమంతా తనకే మిగులుతుంది.

ఈవిధంగా ఆలోచించుకొంటూ ఆ మర్రిచెట్టుదగ్గరకు రాగానే - తోటి స్నేహితులిరువురూ అతనిపై బడి అతన్ని చంపేశారు.

చనిపోయిన వాడిని దూరంగా పారెయ్యాలని అనుకొంటూ వుండగానే వారి దృష్టి సారా సీసాల మీదికి పోయింది. సారా తాగేసి కొంతసేపు హాయిగా కాలక్షేపం చేసుకున్న తరువాత చూసుకోవచ్చులే అనుకుంటూ యిరువురూ ఆ సారా త్రాగటం మొదలెట్టారు. ఆ త్రాగటంలోనూ యిరువురూ ఒకే సీసా తీసుకొని కొంచెం కొంచెం పంచుకుంటూ త్రాగుతూన్నారు. మైకం పూర్తిగా ఆవహించిందిరువురినీ. పాపం! ఆ మైకంలోనే యిరువురూ యీ లోకాన్ని విడిచిపెట్టేశారు.

పాపం! మృత్యు దేవత కోసం వీరు బయలుదేరితే—ఆ మృత్యు దేవతే వీర్ని వరించింది!!! ★

# మాట విలువ

(46-వ పేజీ తరువాయి)

కానుకలో ఇచ్చుకుంటాడనుకున్న సభ్యులంతా అయాజు పలుకులకు ఆశ్చర్యపోయారు.

అయాజు రాజరీవిని అభినయిస్తూ, "నేనిప్పుడు సార్వభౌముణ్ణి కనుక నా యిష్టం వచ్చిన రీతిని చేయవచ్చును! నేనిప్పుడు చేయదలచుకున్న దేమిటంటే, ఈ సింహాసనం మీదనుంచి దిగిపోవడమే. దిగకపూర్వం నేను ఇస్తున్న ఆజ్ఞ ఏమిటంటే, వెంటనే నీవు ఈ గద్దెనెక్కి కూర్చోవాలి!" అంటూ దిగిపోయాడు.

సుల్తాను సింహాసనాన్ని అధిష్ఠించి, "అయాజ్, ఈ సింహాసనంమీద కూర్చున్నంత సేపూ నీకు ఎలాగుంది? ఆనందంగా వుందా?" అని ప్రశ్నించాడు.

అయాజు నవ్వుతో, "ప్రభూ, ఆనందంగానే వుంది. కాని ఆ గద్దె దిగివచ్చాక ఇంకా ఎక్కువ ఆనందంగా ఉంది!" అన్నాడు.

"ఎందువల్ల?" అన్నాడుసుల్తాను.

"నిన్నటివరకునూ ప్రభువు చే ఆజ్ఞాపించబడిన ఈఅయాజు ప్రధాని మాత్రమే. ఇకముందు ఆజ్ఞాపింపబడనున్న అయాజు చక్రవర్తి! సార్వభౌములు ఇంక ఒక చక్రవర్తిని ఆజ్ఞాపించ గలుగుతున్నారన్న ఆనందం నాకు కలిగింది!" అన్నాడు అయాజు.

చక్రవర్తీ, సామంతులూ కూడా అయాజు వినయానికి మెచ్చుకుంటూ హర్షధ్వానులు చేశారు. ★

మంతా వచ్చేవాళ్ళము. నీకుమాత్రం యిక్కడ సేవ చెయ్యటానికి ఎవరున్నారు చెప్పు! మేము వస్తే నేనూ, 'అది' కొన్ని ఉపచారాలు చెయ్యటానికి వుండేవాళ్లము."

"అది నిజమేకాని, మిమ్మల్ని శ్రమపెట్టడం దేనికని వూరుకున్నాను."

"ఇందులో శ్రమ యేముంది తాతయ్యా! మాకు మాత్రం పెద్ద దిక్కు ఎవరున్నారు చెప్పు! మా అమ్మా, నాయనా పోయిన దగ్గరనుంచి తల్లివయినా, తండ్రివయినా నీవేనని భావించాను" అన్నాడు చలపతి తన మాటలకు తానే సంతోషిస్తూ.

ముసలాయనకు అంతులేని ఆనందం కలిగింది. ఆయన చేతితో చలపతి తల నిమురుతూ,

"నాకు తెలుసురా! నీకు నేనంటే విపరీతమైన అభిమానమని"

"ఈ మాటలకేమిగాని ఇవాళ డాక్టరు వచ్చి వెళ్లాడా"

"ఆ! ప్రొద్దునవచ్చి ఇంజక్షన్ యిచ్చి వెళ్ళాడు"

"డాక్టరుగారు ఏమన్నారు తాతయ్యా!" అన్నాడు చలపతి మాటల్లో ఆదుర్దా కనపరుస్తూ.

"పరిస్థితి క్షీణిస్తోంది అంటాడురా!... అయినా క్షయ వచ్చిన తరువాత బ్రతకటం కష్టమే" అంటూ ముసలాయన మూలిగాడు.

"బ్రతికించావు! తొందరగా పోతే చావుండును" అని చలపతి మనస్సులో అనుకొని పైకి మాత్రం దిగులుపడుతున్నట్లు,

"అదేమి మాటలు తాతయ్యా! ధైర్యంగా వుండాలి వూరికే దిగులుపడితే ఎలా! నాకేమీ భయంలేదు జబ్బు త్వరలో తగ్గిపోతుంది. కాసేపు నిద్రపో తాతయ్యా! ఎక్కువగా మాటలాడితే హైరాణపడుతావు" అన్నాడు చలపతి.

"పడుకుంటానుగాని, అమ్మాయి వచ్చింది కదూ! వంటింట్లో అన్ని సరుకులూ వున్నాయి. పెందరాడే వంట చేసుకొని భోజనం కానీయండి."

"అవన్నీ మేము చూసుకుంటాముగాని, ఈపూట నీకు జావగానీ..."

"అలాగే!అమ్మాయిచేత జావకాయించు"

చలపతి కుర్చీలోనుంచి లేచాడు. స్నానంచెయ్యటానికి దొడ్లోకి వెళ్లాడు. భార్య నీళ్ళు తోడిస్తూ "ఎలా వుందండీ! ఆయనకు" అంది.

"మన మనుషున్నట్లేవుంది! తొందరగానే వదిలిపోతుంది ఘటం" అన్నాడు చలపతి స్నానం చేస్తూ.

మధ్యాహ్నం భోజనాలయిపోయాయి, జగన్నాథం, కనకం ఏమీతోచకపోతే మ్యాట్నీ సినిమాకు వెళ్ళారు. ఇంట్లో ముసలాయన, చలపతి కుటుంబంతప్పితే ఎవ్వరూ లేరు.

"తాతయ్యా! భాగవతం కానీ, భారతం కానీ చదివి వినిపించమంటావా" అన్నాడు చలపతి మాటవరసకి.

"ఇప్పుడేమీ వద్దుగానీ, నువ్వు కావాలంటే వెళ్లి చదువుకో? పెట్టె తాళంచెవులు యిస్తాను. ఆ పెట్టెలో అన్ని పుస్తకాలూ వున్నాయి" అంటూ రాజశేఖరంగారు తాళంచెవులు యివ్వబోయాడు.

వద్దంటే బాగుండదని చెప్పి ఇష్టంలేక పోయినా చలపతి తాళంచెవులు పుచ్చుకున్నాడు. మనస్సులో ముసలాయిన మాటలు చికాకు కలిగించినా, పైకిమాత్రం వినయంగా.

"అది కాదు తాతయ్యా! ఈ రోజుల్లో వాళ్ళు సినిమాలూ, షోకులూ మరిగి పుణ్యం, పురుషార్థం సంగతి మరచిపోతున్నారు. (ఇది జగన్నాథం; కనకంల మీద దెబ్బ!) ఎప్పుడూ చెత్త కథలు చదవకపోతే, ఏదైనా పురాణం చదువుకుందామనే జ్ఞానం వాళ్ళకు వుండదు. ఏమో! నామటుకు నేను భారత భాగవతాలంటే చెవికోసుకుంటాను. అవి చదువుతుంటే అమితానందం కలుగుతుంది" అన్నాడు చలపతి తన పాత్ర జ్ఞాపకం తెచ్చుకుంటూ.

"నిజంగా అదృష్టవంతుడివిరా! ఈ రోజుల్లో పురాణగ్రంథాలంటే అభిమానించే వాళ్ళు కొద్దిమందుంటారు. ఎవరి సంగతి ఎలావున్నా నాకు మటుకు ఆ పుస్తకాల పెట్టె పంచప్రాణాలు! అది లేకపోతే నాకు లోకమే లేదు."

"అదికూడా పూర్వజన్మ విశేషమే తాతయ్యా! మానవుడు పూర్వజన్మలో పుణ్యం చేసుకుంటేనేకాని, అలాంటి మంచి అలవాటు కలగదు. ఈ లోకంలో ఏది శాశ్వతం! చచ్చేనాడు మనవెంట వొక్కటీ రాదుకదా! అందువలనే హరిశ్చంద్రుడు 'మాయామేయ జగంబె' అన్నాడు (తనకు పద్యం పూర్తిగా రాదు) ఏమిటో మోహములో పడి ప్రతిదీ నిత్యమనుకుంటాము" అన్నాడు చలపతి ఉపన్యాస ధోరణిలో.

"నీకు ఎన్ని విషయాలు తెలుసునురా! ఏది హరిశ్చంద్రలో వొక పద్యంపాడు!" అన్నాడు ముసలాయన సంబరపడుతూ.

'చచ్చామురా బాబూ' అంటూ మనస్సులో విసుక్కొని పైకిమాత్రం "దానికేమి తాతయ్యా! తీరికగా వున్నప్పుడు అన్ని పద్యాలూ పాడుతాను. మరి నేను వస్తాను" అంటూ తాళంచెవులు తీసుకొని గబగబా గదిలోనుంచిబయటపడ్డాడు. 'హమ్మయ్యా!' అంటూ వొక నిట్టూర్పువిడిచి నెమ్మదిగా వెళ్ళి పెట్టె తెరిచాడు ఏముందో చూదామని.

ఏముంటాయి! భాగవతం, భారతం, వాల్మీకి రామాయణం, యింకా యితర పురాణగ్రంథాలూ పెట్టెనిండా వున్నాయి. తనకు ఆ పుస్తకాలు చూస్తూవుంటే గ్రీకు, లాటిన్ పుస్తకాలు లాగున్నాయి.

ఒక పుస్తకం బయటకుతీసి చదవటం మొదలుపెట్టాడు. ఏమో! తాతయ్య మధ్యలో చూసిపోదామని గదిలోకి వస్తాడేమో! ఎందుకైనా మంచిది చదువుతున్నట్టు కనిపిస్తే. అలాగే వొక గంటసేపు కుస్తీపట్టి గదిలోనుంచి బయట పడ్డాడు. కొంత గాలి పీల్చుకుందామని షికారుకు వెళ్ళాడు.

ఆ రాత్రి ముసలాయిన మూలగటం మొదలుపెట్టాడు. విపరీతమైన బాధపడుతున్నాడు, డాక్టరువచ్చి చూసివెళ్ళాడు. ఇంట్లో అంతా ఆదుర్దా (పైకిమాత్రం) పడుతున్నారు.

తెల్లవారింది. రాజశేఖరంగారు బాగా క్షీణించిపోయారు. బ్రతికి బయటపడే సూచనలు కనపడటంలేదు ఆయన మనుమల్ని దగ్గరికి పిలిచాడు. ఆ సిలో ఎవరికేమి కావాలో చెప్పమన్నాడు. అంతవరకూ గుడిని మింగేద్దామా లేక గుళ్లోని లింగాన్ని మింగేద్దామా అని అంచనాలు వేస్తూ వచ్చిన జగన్నాథం, కనకం వెంటనే తమకు కావలసినవన్నీ వొక పెద్ద లిస్టు తయారుచేశారు. ముసలాయన అది చూసి తనలో నవ్వుకున్నాడు. చలపతిమటుకు అంతవరకూ బెల్లం కొట్టిన రాయిలాగా వూరుకున్నాడు.

"చలపతీ! నీ మాట ఏమంటావు" అన్నారు రాజశేఖరంగారు.

"నాకేమీవద్దు, తాతయ్యా! నీ ఆదరాభిమానాలుంటే అదే పదివేలు"

"అదేమి మాటరా! ఏదో వొకటి కోరుకో"

మేనేజరు:- ఇదుగో, నిన్ను సూటిగా ఒక ప్రశ్న అడుగుతాను, సూటిగా సమాధానం చెప్పు. నాఉద్యోగంలో నువ్వు, నీ ఉద్యోగంలో నేను ఉన్నా మనుకో. ఆ పరిస్థితిలో ఏం చేస్తావు?

నౌకరు:- నౌకర్ని తీసి పారేస్తానండి.

# ★ అదృష్టం ఉండాలి ★

"నాకు జేనిమీదా ఆశలేదు తాతయ్యా! నువ్వు ఏదియిచ్చినా సంతోషంగా తీసుకుంటాను" అన్నాడు చలపతి తన మాటల నేర్పుకు లోపల సంతోషిస్తూ.

"అయితే సరే" అన్నారు రాజశేఖరం గారు ఏదో అర్థమైనట్లు. జగన్నాథం కనకం యిది చూసి విస్తుపోయారు. కొంప తీసి ముసలాయిన తమకు వట్టి చెయ్యి చూపించడుకదా అని లోలోన భయపడ్డారు.

ఆరోజు మధ్యాహ్నం ప్లీడరుగారిని పిలిపించారు. రాజశేఖరంగారూ, ఆయనా వొక గదిలో కూర్చుని రహస్యంగా వీలునామా తయారుచేశారు. అంతా పూర్తిఅయిన తరువాత దానిని ప్లీడరుగారికిచ్చి భద్రంచేశారు.

ఆ రాత్రి ముసలాయనకు బాధ ఎక్కువయింది. విపరీతంగా మూలుగుతున్నాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. గదిలో వున్న దీపం గాలికి రెపరెప లాడుతున్నది. డాక్టరు వచ్చి పరీక్షచేసి పెదవి విరిచాడు.

తెల్లవారేటప్పటికి రాజశేఖరంగారు కన్ను మూశారు. ఇంట్లో అంతా గొల్లుమని ఏడ్చారు. ఎక్కడలేని ఆపేక్ష అప్పుడు చూపించారు మనుమలు. చలపతిమరీ భోరున ఏడ్చాడు.

దహన క్రియలన్నీ సక్రమంగా జరిగిపోయాయి. కర్మకాండలు పూర్తి అయినాయి. ఇక ఎవరి యిళ్ళకు వాళ్ళు వెళ్ళ సన్నాహంలోవున్నారు. ఇంతకీ విలునామాలో ఏముందో ఎవరికీ తెలియదు. అంతా పరీక్ష ఫలితాలకోసం ఎదురుచూసే విద్యార్థులలాగా వున్నారు.

ప్లీడరుగారికోసం కబురు చేశారు. ఆయన వీలునామా తీసుకొచ్చి చదివాడు. అంతా విని జగన్నాథం, కనకం తెల్లమొహం వేశారు. తమ వాటాక్రింద ఎనిమిదివేల ఖరీదుచేసే పొలం మాత్రమేనా అని ఆశ్చర్యపోయారు. ఇన్నాళ్లు తాతగారికి ముప్పైవేలకు పైగా ఆస్తి వుందని తాము అంచనా వేశారే! ఏదో మోసం జరిగింది! ముసలాయన డబ్బు ఎక్కడో దాచిపెట్టి వుంటాడు. ఈవిధంగా వాళ్ళ ఆలోచనలు పోనాయి.

ఇకపోతే చలపతికి మూర్ఛ పర్యంతమైంది. అంతా విన్నాక తనకు తాతగారు పుస్తకాల పెట్టె యిచ్చి వెళ్ళాడు. పైగా వీలునామాలో తాను ప్రాణంతో సమానంగా చూసుకునే పురాణగ్రంథాలను చలపతికి ఇష్టమనే ఉద్దేశ్యంతో యిస్తున్నానని వ్రాశాడు! ఉదరించలేక పోయాడు! తనకెందుకు, వెధవ పుస్తకాల పెట్టె? ఆ గ్రంథాలు తనకేమీ వుపయోగపడేవి కావు. అమ్ముకున్నా వంద రూపాయలు రావు.

చలపతి విచారంతో క్రుంగిపోయాడు. ఏమి చెయ్యటానికీ తోచటం లేదు. ఎంత పొరపాటయింది! అనవసరంగా తాతగారి ముందు తనకు గ్రంథాలంటే యిష్టమని చెప్పాడు. అయినా తాను వూరికే కూర్చోకుండా అనవసరం 'గ్యాసు' ఎందుకు కొట్టాలి? దానికి తాతగారు తగిన శిక్షే వేశాడు. అవును! తన తెలివితక్కువకు ఈ శాస్తి జరగాలిసిందే!

చలపతికి ఇక అక్కడ వుండటం యిష్టం లేకపోయింది. ఏమీ తోచటం లేదు. ఈ పుస్తకాల పెట్టె తన వెంట మోసుకెళ్లటం దేనికి? ఇక్కడే వదిలించుకుపోతే బాగుండును. రైలు ఖర్చులకన్నా డబ్బులు గిడుతాయి ఈ ఆలోచన రాగానే చటుక్కున

"జగన్నాథం! నాకా పుస్తకాలపెట్టె అక్కరలేదు. నీకు కావాలంటే తీసుకో! నాకో వందరూపాయలు ఇవ్వు చాలు! నాదోవన నేనుపోతాను" అన్నాడుచలపతి.

జగన్నాథం ఏమనుకున్నాడో ఏమో, జేబులోనుంచి వందరూపాయలు తీసియిచ్చి "ఇక మీదట ఆ పెట్టె నాదే" నన్నాడు.

మరీ మంచిది! వందరూపాయి లయినా వచ్చినాయి అదే చాలు ననుకొని తాళం చెవులు జగన్నాథానికిచ్చేశాడు. ఇక తాను అక్కడవుండి ప్రయోజనం లేదు. వచ్చిన వాడి పెళ్లికి వచ్చిందే చాలునన్నట్లు చలపతి విరక్తి చేసుకొని వెంటనే భార్యా, పిల్లలతో రైలెక్కాడు.

వాళ్లు అటు వెళ్లగానే జగన్నాథం మెల్లగా పుస్తకాల పెట్టె తెరిచాడు. పుస్తకాలన్నీ బయటకు తీసి వెదకటం మొదలుపెట్టాడు. ఆశ్చర్యం! ఒక పుస్తకంలో పదిహేనువేల రూపాయిల కరెన్సీ నోట్లు వున్నాయి. జగన్నాథం, కనకం తమ అదృష్టానికి మురిసిపోయారు. చలపతి అమాయకత్వానికి మనస్సులో సంతోషించారు. దేనికైనా అదృష్టం ఉండాలంటూ జగన్నాథం పెట్టె మూసేశాడు. ★

# దూరమైన దగ్గర కొండలు

"బాగానే వుంది. ఇంకా చిన్నపిల్లలా మీకూ వేళాకోళాలేనా?" తాయారమ్మ నవ్వుతూ అంది.

"ఆదివారం కాదుటే! ఏదో కాలక్షేపం. నాలుగయినట్లు వుంది. ఆకలి వేస్తుంది. కొంచం టిఫిన్ యేమైనా..." బెదురుతూన్నట్టుగా అడిగేడు రాజారావు.

"ఔను. పని లేకపోతే ఆక లెక్కువే. కానివ్వండి. తండ్రీ కొడుకు లిద్దరూ కలిసి ఆడవాగమ్మలను ఓడిస్తారు కాబోలు!"

"అత్తయ్యా ..మామా, బావా మాకు ముప్పయ్యాటలు బాకీపడ్డారు," పుల్లమ్మ గర్వంగా అంది.

"ఔనే అమ్మా. ఇంకో ఇరవై ఆటలు బాకీపడితే, అన్నయ్యచేత వదినకు సలాం చేయిస్తాను," ఎగతాళిగా అంది నిర్మల.

"పోవే మహా చాలా చేయించావ్" కొంచం విసురుగా అన్నాడు మూర్తి.

* * *

రాజారావుగారు రాజమండ్రీలో పేరు పొందిన వకీలు. సెలవు రోజుల్లో ఇంట్లోనే కుర్రాళ్ళతో కాలక్షేపం చేస్తారు. ఆయనకు మూర్తి, నిర్మల తప్ప వేరే సంతానం లేదు.

మూర్తికి పదిహేడు సంవత్సరాలుంటాయి. స్కూలు ఫైనలు చదువుతున్నాడు. నొక్కు నొక్కుల జుట్టు లేకపోయినా, క్రాపింగు మాత్రం వుంది. సాధారణంగా పారిస్‌లో మారే ఫేషన్లన్నీ ముందు అమలులో పెట్టేవాడు మూర్తే. మేనకోడలు పుల్లమ్మను, రాజారావు, తాయారమ్మా కూడా నిర్మలతో సమానంగా ఏ లోటు రాకుండా చూసుకుంటున్నారు.

"నాన్నా, నాన్నా, మామయ్య దగ్గరనించి ఉత్తరం వచ్చింది." అంటూ పరుగెత్తుకుంటూ వచ్చింది నిర్మల

"ఏమిటమ్మా విశేషాలు, ఏంరాశేడేమిటి?"

"మరే, రేపు సంక్రాంతి సెలవులకు వదినతోపాటు నన్ను, అన్నయ్యను కూడ వాళ్ళ ఊరు పంపించమని రాశాడు."

"ఓహో, పెళ్ళి అవకుండానే అల్లుడుగార్కి ఆహ్వానాలొస్తున్నాయి అన్నమాట" అన్నాడు నవ్వుకుంటూ, కొడుకు మూర్తి నుద్దేశించి.

"పో, నాన్నా, అల్లుడూ లేదూ, గిల్లుడూ లేదూ, నువ్వుమరీను," అని విసుక్కున్నాడు మూర్తి.

"అదేమిట్రా అంత కసురుకుంటావు. పుల్లమ్మ పుట్టినప్పుడే అనుకున్నాం అది నీ పెళ్ళామని," తాయారమ్మ నెమ్మదిగా అంది.

"ఔనాను కడుపులో ఉండగానే నిర్ణయించేస్తారు మీరు పెళ్ళిళ్లు." అన్నాడు మూర్తి.

"బాగానే ఉంది, నువ్వేదో వేళాకోళానికి అంటున్నావు అనుకుంటున్నాను. పుల్లమ్మను నీకివ్వాలని మా అన్నయ్య ఎంతో ముచ్చటపడుతున్నాడురా బాబు.

తాయారమ్మగారు నచ్చచెప్పబోయింది.

"నేను చేసుకోడానికే మీ ముచ్చట పడ్డం లేదుగా."

## ఎ. రామరత్నం

"బాబూ మూర్తీ, అయితే, పుల్లమ్మ నీకు బాగా లేదంటావా?" చిన్నగా ప్రశ్నించేరు రాజారావు.

"ఆ పల్లెటూరు బయితు నాకు నచ్చలేదు నాన్నగారు",

"కొంచం అమాయికంగా ఉంటుందిగాని దానికేమిరా, బంగారపుబొమ్మ.

"ఆ బొమ్మనే నాకొద్దు అంటున్నాను నాన్నా. నాకిష్టం లేదు అని ఒకసారి చెప్పేను? అంతే." అని కోపంగా అనేసి బయటకు వెళ్ళిపోయేడు మూర్తి.

* * *

"ఎందు కేడుస్తున్నావు వదినా?" మంచం మీద పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్న పుల్లమ్మను పలుకరించింది నిర్మల.

"ఏంలేదు; ఊరికనే."

"ఊరికనే ఎవరేనా ఏడుస్తారేమిటి? మా అన్నయ్య అలా అన్నందుకేనా? వేళాకోళానికి అన్నాడేమో."

"ఔనులేవే, నే నంటే మీ అన్నయ్యకు వేళాకోళమే! నేనూ పల్లెటూరి బయితునట, తను పట్నం బయితు కాబోలు! తనకిష్టం లేకపోతే, చేసుకోనని చెప్పేస్తే సరిపోదూ. పైగా పేర్లుపెట్టడం ఎందుకో," దుఃఖాన్ని దిగమింగుతూ అంది పుల్లమ్మ.

"పోనీలేవే, ఏడవకు. వాడికి నీకంటె అందమైన పెళ్ళాం దొరికితే చూద్దాంగా. అయినా నువ్వు మరీను. ఆ బిగించి వేసిన జడ పెద్దఅమ్మవారంత బొట్టు, ఆ మువ్వలపట్టీలు మరీ అసహ్యంగా వున్నాయి."

"ఎవరికి తగ్గా వాళ్లు వాళ్ళకి దొరుకుతారు. మీ అన్నయ్య చేసుకోకపోతే నాకు పెళ్ళే అవదా?"

* * *

"ఏమమ్మా బావరాలేదా? మీ రిద్దరే ఒచ్చేరు? నిర్మలా! అన్నయ్య రావన్నాడా?" అంటూ బండి దిగిన అమ్మాయిలని ప్రశ్నించారు వెంకటప్పయ్య.

"అన్నయ్యకు యేదో పనుందిట. వస్తే తరువాత వస్తానన్నాడు."

"ఔను నాన్నా! బావకు ఈ పల్లెల్లో యేమితోచదు పాపం; అంచేత రాలేదు," వ్యంగ్యంగా అంది పుల్లమ్మ.

"అమ్మా, ఈపూట కాఫీ నువ్వు కాచు తల్లీ మీ అమ్మకు సరిగ్గా తెలియదు. అది కలుపుతే నిర్మలకు బాగుంటుందో బాగుండదో," అన్నారు వెంకటప్పయ్య మధ్యాహ్నం కాఫీ వేళ.

"ఏవమ్మా, నిర్మలా, చదువులు బాగా సాగుతున్నాయా?"

"బాగనే చదువుకుంటున్నాం మామా."

"ఏదో తల్లీ మీ నాన్నగారి ధర్మమా అంటూ మా పుల్లమ్మకు చదువు సాగుతూంది. ఒచ్చే యేడాది పెళ్ళిచేసేస్తే, మా పుల్లమ్మ చదువు బాధ్యత అంతా అల్లుడు మూర్తికి అప్పగించేస్తాను."

నిర్మల సమాధానం చెప్పడం మానేసి పుల్లమ్మకేసి చూస్తోంది.

"ఎందుకు నిర్మలా నాకేసి అలా చూస్తావు? మీ అన్నయ్య ఈ పల్లెటూరి బయితుని చేసుకోనన్నాడని చెప్పేయక," అంది అక్కసుతో పుల్లమ్మ.

"ఏవమ్మా, ఏదేనా, గొడవ జరిగిందా?" నిర్మలను ప్రశ్నించారు వెంకటప్పయ్య.

"ఏంలేదు మామా! మొన్న మాటమీద మాటొచ్చి. మా అమ్మ ఏదో అంటే, ఆ పల్లెటూరి బయితు నాకొద్దూ అన్నాడు, మా అన్నయ్య"

"ఓహో, అంతేగదా! ఏదో వేళా

# ★ దూరమైన దగ్గరకొండలు ★

కోళ్ళానికి అన్నా తేమో? దాని కంత కోపం ఎందుకు, తల్లీ?" అని బుజ్జగించారు కూతురు పుల్లమ్మని.

"ఆ అబ్బాయికంత ఇష్టం లేకపోతే, చేసుకోమని ఎవరూ బలవంత పెట్టడంలేదు. మనమ్మాయికి మొగుడు దొరక్కపోడు లెండి మీ మేనల్లుడు చేసుకోకపోతే," అంటూ సన్నాయి నొక్కులు నొక్కింది సూర్యకాంతం.

"సరే, ... మనమ్మాయికీ పెళ్లవుతుంది. వాళ్లబ్బాయికీ పెళ్లవుతుంది. అందుకో సమా? ఏదో మేనరికం కదా అని," భార్య మాటలకు ప్రత్యుత్తర మిచ్చాడు, వెంకటప్పయ్య.

* * *

"నాన్నా, ఈ పరీక్షలయ్యేక అత్తయ్య గారింటి దగ్గర చదవను," అంది పుల్లమ్మ మొండిగా.

"అదేమిటె ఒదినా, మా అన్నయ్య ఏదో అంటే నువ్వు చదువు మానేస్తా నంటావు. ఇది మరీ బాగుంది"

"ఒద్దు నిర్మలా నీకు తెలియదు," అంది పుల్లమ్మ తనకేదో తెలుసున్నట్లుగా.

* * *

"నాన్నా, నేను ఎం. ఏ. మద్రాసులో చదువుతాను" అని బి. ఏ. ప్యాస్ అయిన మూర్తి తండ్రి నడిగేడు.

"సరె నీకు ఎక్కడ చదవాలనుంటే అక్కడే చదువు. మా దగ్గర ఉన్నంత కాలమే మా చెప్పుచేతుల్లో ఉంటారు. జాగ్రత్తగా వెళ్ళి చదువుకురా నాయనా" అని పంపించారు.

మూర్తికి మొదటనుంచీ నలుగురు ఆడాళ్లతో తిరగడమన్నా, మాట్లాడ్డమన్నా మహా సరదా! కొంచం అందమైన అమ్మాయి కనిపించిందంటే అతను వెర్రెత్తినట్టు అటే చూస్తాడు. మద్రాస్‌లో చదువేమో, ఇంక చెప్పనే అక్కర్లేదు హాస్టల్లో ఉండడం ఎందుకు అని ప్రెసిడెన్సీ కాలేజీకి దగ్గరగా వేరే రూమ్ తీసుకున్నాడు.

ఆరోజు బీచ్ కిటకిట లాడుతోంది. ఒక మూల నలుగురు కాలేజీ అమ్మాయిలు చాలా టిప్‌టాప్‌గా తయారయి కూర్చున్నారు. అదే సమయంలో మూర్తి, స్నేహితుడు విఠల్‌ను వెంటబెట్టుకొని అమ్మాయిలు ఎక్కడ ఉన్నారా అంటూ, చూసి ఆఖరికి ఈ పక్కకు వచ్చేరు. ఆ అమ్మాయిలకు, ఈ అబ్బాయిలకు ఎంతో దూరం కూడా లేదు.

మూర్తి కళ్లు తిన్నగా ఉండవుగా!

"ఒరే విఠల్, ఆ నలుగురిలో నీ కెవరు బాగున్నారురా?"

"పోరా, నీకస్తమాను అమ్మాయిల గొడవలే. ఒక్కసారి వాళ్ల ప్రస్తావన లేకుండా కూర్చుందు."

"ఛ, అది కాదురా, చూడు ఆ మధ్యనుంది. ఆ రెండు జడలు, ఆ వాచి, ఆ లిప్‌స్టిక్, ఆ అమ్మాయికి ఎంత ఆకర్షవంతంగా ఉన్నాయో!"

"ఔనౌను! గొర్రెబొచ్చులా జుట్టు, కోతి మూతిలా లిప్‌స్టిక్, చాలా అందంగా ఉన్నాయి." అన్నాడు విఠల్.

"సరిగ్గా చూడవోయ్, నిజంగా రంభలా ఉంటేను."

"ఉంటే మాత్రం నీకు, నాకు ఏం ప్రయోజనం."

"నీకు లేకపోతే లేకపోవచ్చు. నాకుంటుందిరా."

"నిజమే! నవమన్మథుడికి చిక్కుతుంది. పోరా వెర్రి వెంగళాయి"

"నీ మొఖం, నా సత్తా నీ కేంతెలుసు! చూడు ఒక్క వారం రోజుల్లో."

"సరే ట్రై యువర్ లక్."

"మన ప్రయత్నానికి నాందేమిటంటే ముందు ఆ అమ్మాయి ఇలు తెల్సుకోవడం. అంతే నంటావా?" అని చిరునవ్వుతో ప్రశ్నించాడు మూర్తి.

"సరే మంచిదే కానావడు. నేనింటికి పోతా."

* * *

కాలేజీనుంచి రోజూ చక్కర్లు కొట్టుకొని రూమ్ కొచ్చేమూర్తి ఆమర్నాటినుంచి డైరక్ట్‌గా రూమ్‌కే వచ్చేయడం మొదలు పెట్టాడు. అబీచ్‌లో కనిపించిన అమ్మాయి పేరు పూమాల. మూర్తి కాలేజీనించి రూమ్‌కి వెళ్ళేదారిలోనే ఉంది ఆఅమ్మాయి ఇల్లు. రోజూ కాలేజీనుంచి బస్ దిగి వచ్చేటప్పటికి పూమాల కూడ కాలేజీనుంచి వచ్చి కాఫీతాగి హాగ్గా డాబా మీదనిలబడేది. మన "హీరో" మూర్తి ఏ కిళ్ళీకొట్టు దగ్గరో నించుని సిగరట్టు కాలుస్తూ పోజులు ఇచ్చేవాడు!

ఈవిధంగా ఒకరినొకరు చూసుకోవడం ప్రారంభించి పదిహేను రోజులైంది. ఒక్కరోజు ఆ అమ్మాయి మూర్తికి కనుపించకపోతే చాల బాధపడేవాడు.

పాపం మూర్తికి కష్టంరానే వచ్చింది. పూమాల డాబామీద కనుపించడంలేదు. మూర్తి మనోవ్యాధికి అంతులేదు. ఆ రోజు

పెరిగే వాళ్ళకన్నా ఎక్కువపాలు పడాలి. తల్లిపాలలో ఉన్న ప్రోటీను, క్రొవ్వుపదార్థము జీర్ణమయినంత త్వరగా పోతపాలలో ఉన్న ప్రోటీన్లు, క్రొవ్వు జీర్ణముకావు. ఇంతేకాదు. గాలి, వాతావరణములోని సూక్ష్మజీవులు పోతపాలలో ప్రవేశించటం జరుగుతుంది. అందువల్ల ఆ పాలు త్రాగితే బిడ్డల కనారోగ్యం కలగవచ్చుకూడా. అందుకనే బిడ్డలకు 2వ ఏడువరకు తల్లి చనుబాలివ్వటం మానెయ్యకూడదు.

మరి పిల్లలు నిగనిగలాడే దేహకాంతితోనూ చిఱునవ్వులు చిందులాడే ముఖంతోనూ పుష్టిగా ఎదగడం తల్లి ఇచ్చే చనుబాల లక్షణాన్నిబట్టికూడా ఉంటుంది. ఎక్కువగా నెయ్యి, ఆవుపాలు, కూరగాయలు తల్లులు వాడుతుంటే మంచి బలమైన పాలు ఏర్పడుతాయి. ఎంత బలమైన పాలిస్తున్నా సహజంగా బిడ్డకు షుమారు 5వ నెల, 6వ నెల వచ్చినప్పటినుండి తల్లిపాలు సరిపోవు అపుడు పోతపాలు వాడాల్సిన అవసరం వస్తుంది. అన్ని పోతపాలలో ఆవుపాలు శ్రేష్ఠము.

## ఆవుపాలు

ఎందుకంటే తల్లి ఇచ్చే చనుబాలలోనూ ఆవుపాలలోనూ కెలొరీ విలువ దాదాపు సరిసమానంగా ఉన్నది. మేకపాలలో, శక్తినిచ్చే కెలొరీ పరిమాణం ఎక్కువగా ఉంది. గేదపాలలో క్రొవ్వుపదార్థం అన్నిటికన్నా అధికం, కెలొరీ పరిమాణం కూడా చాలా ఎక్కువ. అందుకనే గేదపాలు వెంటనే బిడ్డకు సరిపడవు.

అంతే కాదు, విటమిను "బి - 1" విటమిను "బి - 2 కాంప్లెక్సు" విటమిను "సి"లు ఆవుపాలలో మాత్రమే ఉన్నాయి. ఈ విటమినులు గేదెపాలలో శూన్యం. తల్లి చనుపాలలోకూడా ఆవుపాలలో నున్నంతగా విటమినులు లేవు.

ఒక ఔన్సు పాలు తీసుకుని పరీక్షిస్తే ఆవుపాలలో 8 యూనిట్లు విటమిను బి-1 ఉన్నది. ఈ విటమిను మేకపాలు, గేదపాలు, చనుబాలలో అసలు లేనేలేదు. విటమిను బి-2 కాంప్లెక్సుకు సంబంధించిన "రైబోఫ్లేవిను" అను పదార్థం ఆవుపాలలో 57 పాళ్ళుంటే మేకపాలలో 11 పాళ్ళు, చనుబాలలో 9 పాళ్లు ఉన్నది. గేదపాలలో ఇది సంపూర్ణంగా నాస్తి. విటమిను "సి" అనేది ఒక్క ఆవుపాలలో మాత్రమే ఉంది. గేదపాలలోనూ, తల్లి చనుబాలలోనూ, ఉన్నదానికంటే దాదాపు 6 రెట్లు ఎక్కువ కాల్షియము ఆవుపాలలో ఉన్నది. పిల్లలకు అజీర్ణం చేయకుండా పుష్టిగా ఎదగాలంటే కాల్షియము అత్యావసరం. ఇన్ని కారణాల వల్ల పోతపాలన్నింటిలోనూ స్వచ్ఛమైన ఆవుపాలే చాలా మంచిది అని తేలుతోంది.

## గుమ్మపాలు

ఏ పాలు వాడినా కూడా, ఆ పళంగా పితికిన పాలను పసిబిడ్డల కివ్వకూడదు. సలసలా మరగబెట్టబడిన స్వచ్ఛమైన నీటిలో కలిపి పాలను పోయాలి తల్లి చనుబాలలో కన్నా ఆవు, మేక, గేదపాలల్లో ప్రోటీన్లు ఎక్కువగా ఉన్నాయి. అందుకనే ఆ జంతువుల బిడ్డలు మనుష్యుల పిల్లలకన్నా అతి శీఘ్రంగా ఎదుగుతాయి. కాని పశువుల పాలన్నింటికంటే కూడా చనుబాలలో "లాక్టోజు" అనబడే చక్కెర ఎక్కువగా ఉంది. అందుకని పోతపాలు వాడేటప్పుడు కొంచెం చక్కెర కలిపితే ఆ లోపం భర్తీ

# నెలల పిల్లలకు ఇవ్వతగు ఆహారం

పసిపిల్లలకు పాలు ఉత్తమమైన ఆహారం. అయినా, లవణములు, విటమినులు ఉండేవి, తేలికగా జీర్ణంకాగలవి అయిన ఇతర ఆహార పదార్థాలు కొద్దికొద్దిగా ఇస్తూ మెల్లిగా అలవాటుచేస్తే బిడ్డలు, ఆరోగ్యంతో దీపకళికలకు మల్లె ప్రకాశిస్తారు పుష్టిగా, కన్నవారి కన్నుల పండువుగా ఎదుగుతారు:

గాలికీ ధూళికీ వదిలివేస్తేమటుకు ఎదగడం మానేస్తారా ఏమిటి, అని మీరు పొరుగింటామె సన్నాయి నొక్కులు నొక్కవచ్చు. ఆ మాట నిజమే కాని, అలాగని, మనం పిల్లల్ని చక్కగా పెంచి పెద్దచేయడానికి "మంచివి" అని మనకి తెలిసిన పద్ధతులు తెలుసుకొని అనుసరించడం తప్పేమీ కాదు. వెయ్యిందాల మంచిది.

ఈ క్రింది పద్ధతిలో క్రమక్రమంగా బిడ్డకు కొత్తకొత్త ఆహారపదార్థాలు అలవాటు చేయవచ్చును.

మూడవవారం:—బత్తాయిరసంగాని, టొమాటోగానీ రోజుకి ఒక్కటే చెంచాడు పట్టవచ్చును.

4 నుండి 6 వ వారం వరకు:—అరటి, మామిడి, లేక యాపిల్ ముక్కలు చేసి, వాటి గుజ్జుని చక్కగా పాలలో కలిపి, రోజుకి ఔన్సులో నాలుగోవంతు మాత్రము పట్టాలి. వారం తరవాత మరో పావు ఔన్సు ఎక్కువ ఇవ్వవచ్చు.

6 నుండి 8 వ వారంవరకు: కాడ్‌లివర్ ఆయిల్ గాని, దానికి సమమైన మరొకటిగాని బత్తాయిరసంతో కలిపి రోజుకు ఒక టీస్పూన్ వరకూ పట్టవచ్చు. ఇలా, క్రమంగా బిడ్డ తత్వాన్ని బట్టి పెంచవచ్చు.

మూడవ, నాలుగవ మాసాలలో:- అభ్యంతరం లేనివారు, కోడిగుడ్డును-ముందు కొన్నాళ్లు కొంచెంకొంచెంగా వండి, పాలలో కలిపి కొద్దిగా పట్టవచ్చు. జీర్ణం చేసుకోగలిగితే, ఆరుమాసాలు వచ్చాక మెల్లిగా రోజుకు ఒక పూర్తి గుడ్డును వాడవచ్చు.

నాలుగునుండి ఆరో నెలవరకు:

బియ్యపునూక వేయించి, వండి, గరిట జారుగా తీసి రోజుకు ఒకటినుండి ఒకటిన్నర ఔన్సులవరకూ ఇవ్వవచ్చు.

కాయగూరలయితే కారట్, బంగాళదుంప, బీట్‌రూట్, ఆకు కూరలు మెత్తగా ఉడికించి గరిటజారుగా గుజ్జుచేసి రోజుకు రోజుకు ఒకటీ ఒకటిన్నర టీచెంచాల వరకూ ఇవ్వవచ్చును. ఆరు మాసాలు దాటాక క్రమంగా కొంచెం కొంచెంగా పెంచవచ్చును.

పప్పు పదార్థాలు అయితే మెత్తగా ఉడికించి ఎనిపి ఒక్కటే చెంచాడు తీసి, మెత్తగా అన్నంతో కలిపి గుజ్జులాచేసి తినిపించవచ్చును.

టొమాటోలు, బత్తాయిలు దొరకని సందర్భాలలో, ఆకు కూరలు చక్కగా కడిగి ఉడికించి, ఆ ఉడికిన నీళ్లను కొద్దిగా పట్టవచ్చును వీటిలో సి. విటమిన్ ఉంటుంది.

బిడ్డ అర్భకుడుగా ఉన్నా, జీర్ణశక్తి తక్కువ అని మీకు తోచినా, ఒకసారి వైద్యుడికి చూపించి, పైనచెప్పిన పదార్థాలు ఇవ్వడం మంచిది.

# సంరక్షణ క్రమశిక్షణ

అవుతుంది. 6 వ నెల పసిబిడ్డలకు రోజుకు ఇచ్చే ఆవుపాలలో మూడు నాలుగు చెంచాల చక్కెర కలపవచ్చును. ముఖ్యంగా గమనించాలిసిన దేమంటే పాలను బాగా కాచటం, పాలను పట్టే పాత్ర లన్నిటిని ముందర సలసల మరిగేనీటితో కడగటం.

పసిపిల్లలకు విటమిను "సి" ని మూడవ మాసం నుండన్నా ఇవ్వటం మంచిది. అంటే రోజుకు 2, లేక 3 చెంచాల బత్తా నారింజ రసాన్ని గాని, టొమాటో రసాన్ని గాని ఇస్తే మంచిది. విటమిను "ఏ" లోపం లేకుండా ఉండటానికి పిల్లలకు 3 వ నెల వచ్చినప్పటినుండి రోజుకు ఒక చెంచాడు "కాడ్ లివరునూనె" వాడవచ్చును. సూర్యరశ్మి చర్మంమీద పడినపుడు విటమిను "డి" తయారవుతుంది. అందుకని విటమిను "డి" లోపం భర్తీ చేయాలంటే దమ్మిడీ ఖర్చు లేకుండా దేహానికి అప్పుడప్పుడు సూర్యరశ్మిని తగులనిస్తూ ఉండాలి.

చక్కెర కలిపిన కండెన్సుడు పాలు పిల్లలకు వాడుట మంచిదికాదు అనారోగ్యం. ఇందులో చక్కెరపాళ్ళు ఎక్కువగానూ, ప్రోటీన్లు, ఖనిజాలు అతి స్వల్పంగాను ఉండుటయే కారణం.

## పాలపొడి

పాలపొడిని మామూలుగా ఆవుపాలతో చేస్తారు. ఆవుపాలను అనేక యాంత్రిక తంత్రాలతో ఎక్కువ ఉష్ణోగ్రతలో ఉన్నప్పుడు పొడిరూపంలో ఘనీభవించేటట్లు చేస్తారు. ఈ పొడిని దాదాపు దానికి 8 రెట్లు బరువునీటిలో కలిపి పాలుచేసి పిల్లలకు పట్టవచ్చును. కాని ఈ పొడులలో విటమిను "సి" శూన్యం కాబట్టి, వీటిని వాడేవారు, పండురసం తప్పకుండా పిల్లలకు పడుతుండాలి.

క్రొవ్వు తీసివేయబడిన పాలపొడితో పాలను తయారుచేసి ఇవ్వచ్చు కాని మొదట ఆ పాలపొడి వాతావరణంలోని గుమ్మ ధూళికి తగులకుండా ఉండాలి. తర్వాత దానితోపాటు విటమిను "ఏ" ఉండే కాడ్ నూనె గాని షార్కునూనెగాని విధిగా వాడాలి పిల్లలకు ఇటువంటివి వాడటం ఏడాది వెళ్ళిన తర్వాత మొదలుపెడితేనే కొంతలాభం కనిపిస్తుంది.



పాలవెల్లి కన్నతల్లి
చిత్రకారుడు: ఎస్. ఆర్. ఎస్. వర్షుల.

కాని శ్రేష్ఠమైన పద్ధతి ఏమంటే పసిబిడ్డలకు 6 వ నెల వరకూ తల్లిపాలతోనే పెంచటం, ఏడాదివరకూ ఆవుపాలనూ, తల్లిపాలనూ ఇస్తూండచ్చు తర్వాత తల్లిపాలతో బాటు గంజినిగాని, "బ్రెడ్"ను గాని, మెత్తగా గుజ్జుచేసి వండిన అన్నము గాని వాడటం మొదలెట్టచ్చు. పండ్లరసం, బాగా వండిన కూరగాయలు, పప్పులు గుజ్జుగాచేసి వాడచ్చు. ఇవి వాడటంలో పిల్లల దేహతత్త్వం, జీర్ణశక్తి గమనిస్తూ ఉండాలి. ఇంత శ్రద్ధతో పిల్లలను పెంచటంలో మన దేశస్థు లెక్కువమంది చూపకపోటం చేతనే ఒక్క 1945 వ సంవత్సరములో దేశంలో లెక్కగట్టి పరిశీలించగా పదిలక్షలకుపైగా పసిబిడ్డలు ఒక్క యేడాది పుట్టిన రోజుకూడా చూడకుండానే కాలగర్భంలో కలిసిపోయినట్లు తెలుస్తోంది. అందుకనే పిల్లలకిచ్చే ఆహారం విషయంలో చాలా శ్రద్ధ చూపటం అవసరం. ఖర్చు తగ్గుతుందని ఏదో ఒకపాలు పోయటం ప్రమాదం ★

# "బొత్తిగా వాడి పొడంటే పడదేం?"

"బొత్తిగా వాడి పొడంటే పడదేం అంట" అనే ఈమాటలు మా తోటి కోడలువంటి పిల్లలతల్లులు చాలామంది నోట వాడబడుతూ ఉంటాయి.

ఏమిటీ అంటే, ఇద్దరు ముగ్గురు పిల్లలు ఉన్న యింట్లో, పిల్లలు ఎప్పుడూ దేనికో ఒకదానికి జగడమాడుకొంటూనే ఉంటారు గదా. అయితే వీటిలో ఒక విశేషమున్నది.

ఇప్పుడు ఒకయింట్లో ఇద్దరు పిల్లలు—అన్నదమ్ములుగానీ, అక్కచెల్లెళ్ళు గాని, లేదా అన్నా చెల్లెళ్ళుగాని ఉన్నారు అనుకొందము. వీళ్ళలో అందరికన్నా చిన్నబిడ్డ మీద ఇంట్లో పెద్దలకు ఎక్కువ అపేక్ష ఉండడము సర్వసాధారణము గదా. ఒకొక్కొక్కసారి, తలి పెద్దవాడిమీద ప్రేమ అయితే, తండ్రి చిన్నబిడ్డని ఎక్కువ ముద్దు చేస్తాడు. లేదూ, ఉన్న ఇద్దరిలోనూ కొంచెము మంచివాడుగా అమాయకుడుగా, లేదా మెతనివాడుగా కనబడే బిడ్డమీద ప్రత్యేకమయిన జాలితో కూడిన వాత్సల్యం వుండడము కద్దు. ఇలాగని, మిగతా వాళ్ళంటే ద్వేషము ఉంటుందని కాదు. తల్లిదండ్రుల దృష్టిలో కన్నబిడ్డలందరూ సమానమే. ఎటొచ్చి చురుకుతనాన్నిబట్టి, వ్రిబాగుల తనమునుబట్టి వాళ్ళలో ఏ ఒక్కరి మీదో కొంచెం ఎక్కువశ్రద్ధ తీసుకొంటారు. ఆబిడ్డ దుడుకు పనిచేసినా వాడిని కొంత వెనకేసుకొని వస్తారు.

ఇందువల్ల, రెండవ పిల్లకి, లేదా పిల్లవాడికి, తల్లితండ్రులు తనని నిర్లక్ష్యం చేస్తున్నారన్న అభిప్రాయం లీలగా కలుగుతుంది. ఈ దశలోనే పక్షపాతం అంటే ఏమిటో (ఈ మాట తెలియకపోయినా) కొంచెం కొంచెంగా తెలుస్తుంది.

తన విషయం అమ్మకీ నాన్నకీ అక్కర్లేదని, వాళ్ళకి తనంటే ఆటే ఇష్టము లేదని, తన అన్నతమ్ముడు తప్పుచేస్తే కొట్టరుగాని, అదే తనుచేస్తే కొడతారనీ వాడి బుర్రకి మెల్లిగా తట్టుతుంది. తల్లి తండ్రులకు బిడ్డలందరిమీద సమాన ప్రేమ ఉంటుంది అన్న సత్యము మనకి తెలుసును గాని వాడికి తెలియుగదా. వాడికేమిటీ, దేముడికి నరులందరూ సమానమేయన్న సత్యాన్నే, మనము కష్టాలలోయున్నపుడు శంకిస్తాము.

సి. కామేశ్వరి
(రాజమండ్రి)

అందువలన వాడికి ఈ భావము—ఖచ్చితంగా ఇలా అని కాకపోయినా లీలామాత్రంగా, వాడికి తెలియకుండానే కలగడంతో, మెలిగా తన సోదరి, లేక సోదరుడు (తల్లితండ్రుల ఎక్కువ ప్రేమకి పాత్రుడు అయినవాడు) మీద ఒక విధమైన—ద్వేషము అని అనను గాని, కోపము చిరాకు కలుగుతాయి.

అక్కడనించి, ఆ రెండవపిల్లవాడితో జగడము వేసుకోవడమూ, వాడి చేతిలో ఉన్నది లాక్కొనటము చేస్తాడు. వాడిని తన దగరకు రానీయడు.

తను ఒంటరిగా కూర్చుంటాడు కోపంగా ముఖం ముడుచుకొని.

ఇటువంటి సందర్భాలలో తల్లి తండ్రులు వాడినిమందలించడం, 'మరీ వాడిపొడఅంటే నీకు పడదేమిరా" అనడం, ఇంటికి ఎవరైనా వస్తే, పిల్లల ఎదురుగానే, "ఇద్దరు వెధవలకీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది" అని గొప్ప చెప్పినట్లు చెప్పడము సర్వసాధారణముగా చూస్తూ ఉంటాము

ఇప్పుడు ఈవిషయంలో తప్పెవరిది అని ఆలోచించడ అనవసరము.

తలితండ్రులు ఒక బిడ్డ విషయంలో ఎక్కువ అపేక్షగా ఉండడం తప్పుకాదు. అలాగే ఉపేక్షించబడిన పిలవాడు, తల్లికి, లేదా తండ్రికి తనంటే ఇష్టము లేదని 'అపోహ' పడమూ తప్పుకాదు. ఎందుకంటే, వాడి ఆలోచనా శక్తి, పరిశీలనా శక్తి వికసించి ఉండవుగదా.

ఇటువంటి విషయాలలో అసలే బాధతో, ఎవరికీ చెప్పలేక, ఏమి చేయాలో తెలియక, పెంకెతనానికి దిగిన పిల్లవాడిని, "నీకు తమ్ముడంటే అసలు గిట్టదేమి" అంటూ నేరానికి పనిచేసినట్లు మందలించడము ప్రయోజనకారి కాదు సరిగదా, అక్కడి నుంచి ఆ పిల్లవాడు మరింత మొండికెత్తడానికి కారణం అవుతుంది.

అందుచేత, బాధ్యతగల తలితండ్రులు, ముందరే ఈ విషయంలో శ్రద్ధ తీసుకోవాలి.

ముందర చేయవలసిన పని "వాడి పొడ నీకు గిట్టదు" అన్న నాలుగు మాటలను పూర్తిగా మర్చిపోవడం మంచిది. ఎప్పుడూ ఆ మాటలు వాడకూడదు. తరువాత, పిలడికి, అంటే, అన్నతమ్ములతోను అక్కచెల్లెళ్ళతోను జగడం వేసుకునే వాడికి, మనసులో ఉండే అపోహలు తొలగించడానికి ప్రయత్నం చేయాలి. వాడికి అవీ ఇవీ కొని పెట్టడము, వాడు చిన్నపని చేసినా కొంత గట్టిగా మెచ్చుకోవడము, ఎదటి వాళ్ళు వచ్చినప్పుడు వాడి మంచితనాన్ని మెచ్చుకోవడము, వాడు ఇచ్చే సలహాలు హాస్యానికైనా నప్పుకొల్లా పాటించడము, సాధ్యం కానివైనా వాటిని కొంచెము మెచ్చుకోవడము వంటి పనుల వల్ల, వాడికి మనమీద, తన మీదా కూడా క్రమంగా నమ్మకం పెరుగుతుందనీ, అపోహాలు పోతాయని, నేను తెలుసుకొన్నాను. 

## వనితల కొరక వినతి

"వనితాలోకం" శీర్షికకు వ్యాసాలూ, చిత్రాలూ, లేఖలూ పంపేవారు చాల మంది తమ చిరునామాలను వివరంగా వ్రాయటంలేదు. కొందరు తమ పేరూ ఊరుపేరూ మాత్రము వ్రాసి ఊరుకొంటున్నారు. ఇందువల్ల పత్రిక ప్రతులు పంపడానికి వీలు ఉండదు.

రచయిత్రులంతా ఈ విషయంలో శ్రద్ధవహించి, తమ పూర్తి చిరునామాలను వివరంగా వ్రాసిపంపాలని కోరుతున్నాము.

# ★ నాకుతోచిన ఉపాయం ★

ఆచంట ఇందిర (మద్రాసు)

మా అబ్బాయి మొన్న మొన్నటిదాకా బడికి వెళ్లడానికి ఎంతో మారాం చేసేవాడు. అంతమారామూ చేసి, చివరకిఎలాగో అలా వాడిపంతమే నెగ్గించుకొంటూయుండేవాడు. మొన్న మొన్నటివరకూ కూడా మాకు ఇది పెద్దసమస్యగా నేవుంటూ వచ్చింది మావారికి విసుగెత్తి వాణ్ణి కొట్టడానికికూడా ఒక్కొక్కసారి సిద్ధంఅయేవారు. నాకేమో అలా వాడిమీద చెయిచేసుకోవడము సుతరాం గిట్టదు.

ఎలాగా ఈపిల్లవాడి మనసు మార్చడమా అని నాకున్న తెలివితేటలు అన్నీ ఉపయోగించి ఆలోచించాను. (ఆడవాళ్ల తెలివితేటలు చాలా లిమిటెడ్ అని వారు హేళన చేస్తూవుంటారులెండి.) చివరకి, మాచిన్నప్పుడు మామామగారు చేసిన ఉపాయమే నాకూ ఉపయోగించింది.

మేము మేనత్త మేనమామబిడ్డలంలెండి. ఇద్దరం చిన్నప్పటినుండీ ఒక్కచోటనే పెరిగాము. అప్పట్లో మావారు నాలుగోక్లాసు, నేను మూడోక్లాసులో ఉండేవాళ్లము. వారు ఎప్పుడూ బడికి వెళ్ళనని మారాము చేస్తూయుండేవారు.

ఆరోజుల్లో పిల్లలపోషణమీద ఇప్పుడు ఉన్నన్ని సిద్ధాంతాలూ అవీ లేవుగా. పిల్లవాడు అల్లరిపెడితే, వెంటనే చెంపలు వాయించేయడమే మందు. బడికివెళ్ళనంటే, బడినించి పెద్దక్లాసుపిల్లలు వచ్చి బలవంతంగా చిన్నపిల్లల్ని మోసుకుని తీసుకుని వెళ్ళిపోయేవారు.

నాకు ఇంకా బాగా జ్ఞాపకముంది ఆ పాట.

ఒక పెద్దక్లాసుపిలవాడురోజూ ప్రొద్దుట ఏడుగంటలు కొట్టేసరికి మాగుమ్మముమీద ప్రత్యక్షం అయేవాడు.

బాబూరావూ
ఏడయ్యిందీ
ఒళ్ళోకి
వస్తావా
రావా?

అని తాళంవేసినట్లు గట్టిగా పాడేవాడు. అపుడు, ఈ బాబూరావుగారు, కడుపునొప్పి అనో ఇంకేదో చెప్పి రాననేవారు. అపుడు ఆ వచ్చినపిల్లాడు, యేం చద్దన్నం తినడం అయిందా అని ఇంట్లో అడిగి, అయిందంటే అమాంతంగా బాబూరావుగార్ని ఎత్తుకుని బళ్ళోకి వెళ్లిపోయేవాడు. (బడి దగ్గిరే ఉండేదిలెండి).

ఇలా ఎన్నాళ్లయినా, ఆయన రోజూ ఇలాగే మారాం చేసేవారు. (నేను ఎపుడూ ముందస్తుగా వెళ్ళి సిరివేయించుకొనేదాన్ని అనకోండి.)

చివరికి చెప్పొచ్చేదేమిటంటే, మా బాబాయిగారు ఆపూరు వచ్చి కొన్నాళ్లుండడము జరిగింది. రెండురోజుల్లోనే ఆయనకి మావారి పెంకితనం సంగతి తెలిసింది.

ఆయన వారిని మార్చడానికి ముందర చేసినపని ఏమిటంటే, వారికి ప్రత్యేకం అని ఒక చిన్న బల్లకుర్చీ చేయించారు. వాటిని ఒకమూల వేయించారు. మూల అని ఎందుకు అన్నానంటే, మాయిల్లు పెద్ద భవంతి ఏమీకాదు, మనిషికి ఒకగది ఇవ్వడానికి. అందుకని, పెద్దగదిలోనే ఒక మూలని కేటాయించారు.

ఆతరవాత, "ఇదుగో బాబూరావూ. ఇది నీగది, ఇక్కడ నీపలకాపుస్తకాలూ తడూ బొంగరాలూ సర్దుకోవాలి" అని మావారిచేత 'వేరే కాపురం' పెట్టించారు. బాబాయిగారు చేసిన రెండవపని, మా వారి ఎదురుగుండా, నన్ను అస్తమానూ మెచ్చుకోవడం.

ఒక్కోసారి, ఆయన ఏదేనా మాటాడితే వినకుండా, నా వేపు తిరిగి నా మాటే వినడం, పైగా, "నువ్వు బంగారు తల్లివమ్మా, బడి సంగతులు అడిగితే నిన్నే అడగాలికాని వాడికేం తెలుస్తాయి" అంటూ అనేవారు.

ఇలా మెలిమెలిగా, బడికి వెళ్ళేవాళ్ళే మనుషులు, చాలా గొప్పవాళ్లు, వాళ్ళతోటే పెద్దవాళ్ళు నిజంగా మాట్లాడతారు, పెంకివాళ్ళకి ఏమైనా కొనిచ్చినా వాళ్ళ మారాము భరించలేకనే తప్ప, మరెందుకూ కాదు అని మనకి అనిపించేలా చేశారన్నమాట. నామటుకు నాకు, అచ్చంగా అలాగే అనిపించేది అప్పుడు. ఎంతో గర్వంగ తిరిగేదాన్ని. అప్పుడు మా వారితో కూడా గర్వంగా మాట్లాడేదాన్ని. ఇలా రెణ్ణాలు అయేసరికి, వారు మెలిమెల్లిగా మారాం చెయ్యడం మానేసి, నాతో పంతము వేసుకుని పెందరాళే బళ్ళోకి పరిగెత్తేవారు.

ఇంతకీ ఇప్పటి విషయం చెప్పాలిగద. ఇప్పుడు ఈ మద్రాసు పట్నంలో, మా చిన్నప్పటిలాగ, "ఒళ్ళోకి వస్తావా రావా" అంటూ [illegible] పిల్లలని ఎత్తుకుని తీసుకు వెళ్ళిపోయే వాళ్ళు లేరు; [illegible] పంపిస్తే తప్ప బడివాళ్ళు ఏం చెయ్యరు.

పత్రికల్లో చదివే సూత్రాలు ఎలా ఉన్నా పిల్లలు రోజూ బడికెళ్ళకి అల్లరిచేస్తే, నిజంగానే ప్రాణం విసుగెత్తి ఒక లెంపకాయ వెయ్యబుద్ధి వేస్తోంది. మన చిన్నతనం

# దస్తూరి మనగుణాల కస్తూరి

ఎం. ప్రసన్నకుమారి (బొంబాయి)

మన Hand Writing (చేతివ్రాత, లేక దస్తూరి) ని బట్టి మన గుణగణాలను కొంతవరకూ కనిపెట్టవచ్చునంటారు ఇది ఒక Science (శాస్త్రము లేక కళ) గా అభివృద్ధి చెందింది కూడా.

ఫ్రాన్సులో రేమండ్ ట్రిలాట్ అనే అతడు ఈ శాస్త్రం ఆధారంగా ఒక కొత్త సిద్ధాంతము కనిపెట్టాడు.

మన చేతివ్రాతనుబట్టి మన గుణాలను మన పద్ధతులను, లక్షణాలనూ తెలుసుకోవడం సాధ్యం అయినప్పుడు, ఆ చేతివ్రాత, పద్ధతిని మార్పించి, తగిన విధంగా చేసినపక్షంలో, అపుడు దానినిబట్టి, ఆ మనిషిలోని లోపాలూ, చెడ్డలక్షణాలూ సర్దుబాటవుతవా అని అతని వాదము. ఉదాహరణకు స్వతహా కొంచెం పిరికితనం భయం ఉన్నవారి, దస్తూరీని పరిశీలన చేస్తే, అక్షరాలు అన్నీ క్రిక్కిరిసిపోయి గజిబిజిగా ఉంటాయి అని అతడి పరిశీలనవల్ల తేల్చాడు.

అపుడు, అలా రాసే పిల్లల్ని కొందర్ని చేరదీసి, వాళ్ళచేత, దగ్గర ఉండి, అక్షరాలు ఎడమెడంగా, గుండ్రంగా, కుదిమట్టంగా వ్రాయించాడు.

ఈ ట్రిలాట్ అనే ఆయన ఈవిధంగా రకరకాల దస్తూరీ వ్రాసే ఆరువందలమంది పిల్లలకి ఒక్కొక్కరికి ఒక్కొక్క రకమైన Exercise (సాధనకు పాఠం) ఇచ్చి సాధన చేయించాడు. దస్తూరి కొంత కుదిరిన తరవాత వాళ్ళకి, స్వతంత్రమైన పద్ధతిలో నిబ్బరమైన అక్షరాలు రాసే పద్ధతి అబ్బేలాగ చేశాడు. ఇలాగ ఈ ట్రిలాట్ తరిఫీద్ చేసిన 6 వందలలోనూ 5 వందల మందిని మంచి దారిన పెట్టగలిగాడట.

ఈ ట్రీట్‌మెంటు ముఖ్యంగా పిల్లలకేనని చెప్పవచ్చు. ఎందుకంటే, దస్తూరీ తీరు మారినంత మాత్రమున శీలము (Character) కూడా మారడం, లేత మనస్సు గల పిల్లల విషయములోనే సాధ్యము.

దిగులు, బెంగ, భయం వంటివి ఉన్న పిల్లల దస్తూరీలే, గజిబిజిగా, ఇరుకుగా ఉన్నాయనీ, ఆ గజిబిజి రాత బాగా వంట పట్టినందువల్ల, అప్పటికే ఉన్న దిగులు, బెంగ, భయము పెరగడమేకాక, కొత్త అవలక్షణాలు కూడా అబ్బుతున్నాయనీ ట్రిలాట్ పరిశీలించిన కేసులవల్ల ఋజువు అయింది.

ఏది ఎల్లా ఉన్నా, పిల్లల దస్తూరీ విషయంలో చిన్నప్పటినించీ ఎక్కువ శ్రద్ధ వహించడం అన్నివిధాలా మంచిది. చక్కని అక్షరాలు విడివిడిగా కుదురుగా బలంగా, నిబ్బరంగా ఉండేలా వ్రాయడం వాళ్ళకి చిన్నపుడే నేర్పిస్తే, ఆ దస్తూరీలాగే వాళ్ళ హృదయాలు కూడా వుంటాయి. పోను పోను, వాళ్ళకి, చిన్నప్పటి చేతివ్రాత Basis గా స్వతంత్రమైన పద్ధతి అలవాటు అవుతుంది.

అందువల్ల, చిన్నపిల్లల దస్తూరీ విషయంలో, చదువుకన్న ఎక్కువ శ్రద్ధతీసుకోవడం మంచిది. ముఖ్యంగా ఈ బాధ్యత నిర్వహించవలసిన వ్యక్తి తల్లియే తప్ప మరెవ్వరూ కారు. ★



రోజులకి మల్లె ఇప్పుడు 7 గంటల బస్సులు లేవు. అంచేత పొద్దున్నే లేవనక్కర్లేదు. చద్దన్నం రోజులు కూడా పోయాయిగదా.

ఆఫీసరులాగ, తొమ్మిదిన్నరకి భోంచేసి వెళ్ళచ్చు. అయినా మా అబ్బాయికి బడి పోపె గిట్టేదికాదు. అదృష్టవశాత్తూ, పైన వ్రాసిన, నా చిన్నప్పటి మా బాబాయి ఉపాయం జ్ఞాపకం వచ్చి, నేను మా వారు కూడబలుక్కుని ఇంచుమించుగా అలాగే చేశాము. అయితే, ఇక్కడ మా అబ్బాయికి, మేనత్తకూతురు ఎవరూ రెడీగా లేదనుకోండి. మేము మా ఉపాయాన్ని పక్కవాటా (ఇల్లుకాదు సుమండీ). లో వాళ్ళ అబ్బాయి సహాయంతో ప్రయోగించాము.

ఐతే ఒక్క విషయము. ఇలాటి చిక్కులు పిల్లలుకన్న ప్రతివాళ్ళకీ ఉంటాయి. ఇలా, మన పిల్లవాడిని బాగుచేయడంలో, ఇంకోపిల్లనో పిల్లవాడినో చేరదీసి పొగడడము సాగిస్తూ ఉంటే, అది ఎక్కువ అయితే, ఒక్కొక్కసారి, ఈ పిల్లవాడు దారికి రావడానికి బదులు మరీ మొండికెత్తడం జరగవచ్చు. తను చెడ్డవాడు కాబోలు అనే నిశ్చితాభిప్రాయము వాడిలో కలగనివ్వకూడదు. పైగా. మనము వాడి దృష్టి ఆకర్షించడం కోసము చేరదీసి పొగిడే రెండో పిల్లవాడి మీద వాడికి ఈర్ష్యాద్వేషాలు పెచ్చురేగనివ్వకూడదు. కొద్దిరోజులు అతి పదనుగా, జాగ్రత్తగా ఈ పద్ధతిని ఉపయోగించితే, మంచి ఫలితాలు తప్పకుండా సాధించవచ్చును అని నా అనుభవం మీద చెప్తున్నాను. ★

# పిల్లలూ మనస్తత్వాలూ

కోటమర్తి భ్రమరాంబ (పిఠాపురం)

"సుబ్బా!"...

"కాంతీ, సుబ్బు లేదే?"

"వాళ్ళింతో వుందమ్మా!"

అంతలోకే సుబ్బులు గబగబ పరుగెత్తుకుని, చెంగుని గుమ్మంమీంచి ఎగిరి వసారాలోకి వచ్చింది. "ఒసే! 'పక్కింటమ్మాయి', బువ్వకి వెళ్ళింది..."

"హా...ముక్కుతో రాగాలాపన."

సుబ్బుల్ని 'పక్కింటమ్మాయ్' అంటే ఉడుక్కుంటుంది. కానీ అది ఇంట్లో వుండే సమయంకన్న ఇంటివారి పద్దెనిమిదేండ్ల వాంచారమ్మతో ఆటపాటల్లో గడిపేదే ఎక్కువ మరి దీని వయస్సేపాటి అని చూస్తే నాలుగేళ్ళే! మూడేళ్ల కాంతి ఆటలకీ, దాని ఆటలకీ ఎక్కడా సాపత్యమనేది లేదు.

సుబ్బులు కన్నీ కంటిని చెదరగొట్టే గాఢమైన రంగులూ, డాబుసరి బొమ్మలూ ఉండాలి. దీనిని బాహ్యాడంబరాలూ, బాహ్య సౌందర్యము ఎక్కువగా ఆకర్షించివేస్తాయి.

కాంతి ఒకరకపు ఏకాంత స్వభావం గలది. అది పైవారితో క్షణాలమీద కలిసిపోలేదు. ఇంట్లోవాళ్లతోనే ఆడుకుంటుంది. బొమ్మలకన్న మనుషులే ఎక్కువ విలువగలవారు దీని దృష్టిలో! అందుచేతనే ఇది హాయిగా వాళ్ల పాతికేళ్ళ బాబాయిని కాళ్ళలో పడుకోబెట్టుకుని 'ఉగ్గు' సునాయాసంగా పట్టేయగలదు. తిలంటే పోసేస్తుంది. సమయానుకూలంగా ఏడవటానికి ఆ పెద్దపాపడు నిరాకరించాడా, తనే ఆరంభిస్తుంది కూడా! ఇలా దీని ఆటలు realistic గా వుంటాయి! కాంతి జీవితాన్ని అంతరంగిక విలువలనూ గ్రహించగలదు!

సుబ్బుల్లా కాంతి స్వతంత్రంగా వ్యవహరించటం లేదు. లేత వయస్సు దీనికి కారణమనిపిస్తుంది.

కానీ నా సైకాలజిస్టు మరిది, మరో రకమైన కారణాలు చెప్తాడు. 'ఎంత లేత వయసైనా సరే వారి వారి వ్యక్తిత్వం వారి మనస్తత్వాలను బట్టే కనబడక తీరదు' అంటాడు. వీరి ప్రతి చేష్టనీ, ముఖంలో ప్రతిబింబించే ప్రతిభావాన్ని 'ఎనలైజ్' చేసి పెట్టేశాడు.

ఆనాడు రేడియో పాటకి కాంతి డాన్సు చేస్తోంది. చేస్తూ చేస్తూ పడిపోయింది. కాంతి కాస్త పస్తాయించి చూసింది. అందరూ నవ్వేరు. - ఆరంభించింది - దానినెవరూ చటుక్కున లేవనెత్తి, ఓదార్చి "అయ్యో ఎంత దెబ్బతగిలిందే నా తల్లికి!" అనలేదు సరిపోయె - పోనీ చూడనట్లు వాళ్ల ధోరణిలో ఉన్నా సరిపోయేదిగా? ఊహు-అదీ లేదు. పైగా నవ్వు కూడా అందరూ ఏకమై! మరి ఆ చిన్న మనసు విన్నబోయింది. ఆ విధంగా తగిలిన గాయం ఈ 'గానంగా' రూపాంతరం చెందింది!

సైకాలజిస్టుమరిది దాని తత్వాన్ని క్షణంలో అవగాహన చేసేసుకున్నాడు. వెంటనే అన్నాడు: "సుబ్బా, పాపం కాంతికి దెబ్బతగిలింది. 'వేసలైను' సీసా తీసుకురా."

సుబ్బులు హడావుడిగా పరుగెత్తుకుపోయింది సీసాకోసం. ఆసీసా ఎక్కడుందో దానికి తెలీదు. మళ్లీ అంత హడావిడిగానే పరుగునవచ్చి 'ఎక్కడా కనపడలేదు' అని చెప్పేసింది. ఏదైనా ఇంత పని చెప్పేసరికి దాని గలభాకి అంతుండదు మరి. ఆ హడావుడిలో ఒకదానికోసం పదింటిని పెల్లగించి రెండు దెబ్బలు తగుల్చుకుని కిమ్మనకుండా వూరుకుంటుంది.

"పెద్దగది అద్దాల అలమారులో కిందనుందే." నా మాటలు పూర్తిగాక పూర్వమే రెండంగల్లో వెళ్ళింది. తిరిగి ఆ శరవేగాన్నే వస్తూ ద్వారబంధాన్ని 'పడీ'మని 'డీ'కొట్టి ఏమ వనట్టుగా సీసా అందించింది.

ఈ గలభా వింటున్న కాంతి ఆలాపన గమనం తగి మూడో కాలం నుండి ఒకటో కాలంలోకి దిగజారిపోయింది. దెబ్బ ఎక్కడ తగిలిందో జాగ్రత్తగా వాళ్లి డాక్టరువాన్న స్వయంగా పరీక్షచేసి ఇంత వేసలైను పులిమేసరికి గమ్మున వూరుకుంది. కానీ మొహం మాత్రం మహా గంభీరంగా పెట్టేసింది.

ఈ విశేషాన్ని ఎత్తిచూపి కాంతీ, సుబ్బుల స్వభావాలలో పోలికలూ తేడాలూ, తేరీజు వేసి నామరిది చెప్పేవది. "కాంతి 'సెన్సిటివ్ గర్ల్' (Sensitive Girl) అని.

"అలాంటి పిల్లల విషయంలో చాలా మెలకువతో ప్రవర్తించాలి. సున్నిత స్వభావంగల వాళ్ళ మేధ తీవ్రమైనది. చాలా చురుకైన వాళ్ళవుతారు. వాళ్ల గ్రహణశక్తి (Sense of Perception) చాలా హెచ్చు స్థాయిలో వుంటుంది!" దీన్నే నిరూపించాడు కూడా మరిది.

'సైకాలజిస్టు' మరిది చెవులు Sound Proof, అంటే కేవలం గోడే నన్నమాట. అతనితో ఏంచెప్పాలన్నా వ్రాయవలసి వస్తూండేది సమయాలనుబట్టి అరచేతిలోను, నేలమీదా, గాలిలోనూ అక్షరాలని వ్రాస్తూండేవారం మేము. అతను ఏదో పత్రిక తిరగేస్తున్నాడు. అక్కడ వున్న కాంతి, "బాబు,ఆబొమ్మేంటి"అనిఅడిగింది.

బాబుదగ్గిర నుండి సమాధానం లేక పోయేవరకూ, అది బాబు గడ్డంపట్టి మొహం తన వైపు తిప్పుకుని అరచేతిలో గబగబా తన ప్రశ్నను రాసేసిం దీ మూడేండ్ల అక్షరాభ్యాసంకాని పిల్లాను! అక్షరాలను పోల్చుకోలేక తికమకపడ్డాడు బాబు!

మేమందరం అవలంబించే పద్ధతి చూసింది. మాట చెప్పేవందువల ఈ 'బాబు' కు ఏమీ తెలియదని పసిగట్టింది. బోధపరిచే విధానాన్ని కూడా గమనించింది; గ్రహించేసింది-ప్రయోగించేసింది కూడా! మరిది తలూపుతూ "షార్ప్" అన్నాడు.

మరొకరోజు భోజనాలదగ్గిర వడ్డన్న కాకరకాయకూర కాంతీసుబ్బులూ వద్దు గాక వద్దన్నారు. మరిది వాళ్ళ నేడిపించటానికి కూరముక్క నోటబెట్టుకుని నానా అవస్థాపడుతూ అదెంతో తియ్యగాఉన్నట్లు నటిస్తూఅన్నాడు, "సుబ్బా, అబ్బ! కూరెంత తియ్యగా వుందనుకున్నావు!" అని, అది ఆ 'సర్టిఫికేటు'ను ఆమోదించక పోయేసరికి ఓప్రశ్న వేశాడు, "తీపి అంటే ఎల్లా వుంటుంది సుబ్బా?"

దీనికెవరు చెప్పగలరు సరైన సమాధానం?

సుబ్బులు చెప్పిందీ "పుల్లగావుంటుంది."

కాంతి అనంగీకారాన్ని సూచిస్తూ పెదుగుమీసాల మూతి వంకరగా తిప్పి, లొట్టవేస్తూ "పంచదారలా వుంటుంది"అంది. నిజంగా 'సైకాలజిస్టు చెప్పినట్లు కాంతి తెలివితేటలు మాంఛి పదునుగలవే!

అలా అని సుబ్బులు 'మొద్దు' కాదు దాని తెలివి 'ఏవరేజ్' ఇప్పుడీ ఇద్దరి సామాన్య ప్రవర్తనా చూస్తే——

సుబ్బులు బడబడవాటపుది. చటుక్కున ఉడుక్కునేస్తుంది. అంతచటుక్కునే మరచిపోయి నవ్వేస్తుంది. దానికి బాహ్యాడంబరాలు కావాలి. అది ఇట్టే నలుగురిలో కలిసిపోతుంది. చురుకుతనం కలది. అది 'Extrovert' దానిని మందలిస్తూండాలి పెద్దదైనా!

మెచ్చుకొన్న ముచ్చట :

# మొన్నమధ్య ఒకరోజున

స్త్రీలూ పురుషులూ సమానులే అని పురుషులు అంగీకరించరని స్త్రీలు అంటారు గాని, అది నిజం కాదనిపించే ముచ్చటొకటి ఈమధ్య జరిగింది. ఇంకోటీ ఇంకోటీ కాదు, తెలివితేటల విషయంలోనే, ఒక పెండ్లి కుమారుడి తండ్రి పెళ్ళికూతురు తెలివితేటలను తన కుమారుడితో సమానంగా లెక్కకట్టాడు.

ఆ అమ్మాయి బి. ఏ. ఫస్టుఛాన్సులో ఫస్టుక్లాసులో ప్యాసయింది. ఆ అమ్మాయి తండ్రి కాలికి బలపం కట్టుకొని తిరిగాడు పెండ్లిసంబంధంకోసం. చివరకి ఒక వరుడు దొరికాడు. ఆ అబ్బాయి పడుతూ లేచే పిల్లాడిలా, చదివిన క్లాసే మూడేళ్లు చదివి ముప్ఫైఏళ్లు వచ్చేటప్పటికి బి. ఏ. కి వచ్చాడట. సరే ఆ పిల్లాడితండ్రి బయలుదేరాడు. ఎవరికోసం? పిల్లకోసం కాదు. కట్నం! కట్నం కోసం!

సరే పిల్లని చూచుకున్నారు.

“అమ్మాయి ఫస్టున బియ్యే ప్యాసైందండి” అని తెలియచేశాడు పిల్ల తండ్రి; చదువుని చూసైనా, పెళ్ళివారు కట్నం తగ్గిస్తే ఎలాగో ‘మూడుముళ్లూ’ వేయిద్దాం, అన్న ఆశతో.

“అమ్మాయికి ఎన్ని సంవత్సరాలుంటాయో” అన్నాడు పెండ్లి కొడుకు తండ్రి గట్టిగా అడగలేక, లోపల దాచుకోలేక.

పంధొమ్మిది సంవత్సరాలండి అని చెప్పింది పెళ్ళికూతురు తల్లి.

అయినా పెళ్లికొడుకు తండ్రికి అట్టే నమ్మకం కుదరలేదు.

“అహా. బి. ఏ చదివింది కదుటండీ! అందుకని...” అని నసిగాడు, తన కుమారుడు బి. ఏ. అయ్యేసరికి మూడో పుష్కరం జరుగుతోంది కదూ, అందుకని అందరూ బి. ఏ. కి వచ్చేటప్పటికి ముప్ఫైఏళ్ళు నిండుతాయేమోనని ఆయనగారి అనుమానం!

ఇలాటి పరీక్షలు దాటితే, చివరకి పెద్ద పరీక్ష ఇంకోటి ఉంటుంది

అది కట్నం. అది నెగ్గితే, అప్పటికి సంబంధం స్థిరపడ్డట్లు అన్నమాట!

ఏవిధంగా చూచినా, సమాజంలో స్త్రీల పరిస్థితి ఇలాగే ఉంది. పెళ్లి అంటే బేరం అనే అర్థం స్థిరపడిపోయింది.

ఇప్పుడు స్త్రీలకు ఆస్తిహక్కులు వచ్చాయి గాబట్టి ఇంక అంత ఫరవాలేదని నేను నా మిత్రురాలితో అంటే, వెంటనే ఆమె, “ఆ ఏముందోయ్ ఇకనుండి అబ్బాయిలు ఆస్తికివారసులయిన అమ్మాయిల కోసం ‘వేట’ ప్రారంభిస్తారు. ఎలాగయినా బేరం ఆడటము మాత్రము తప్పదులే” అన్నది నవ్వుతూ.

దాసరి శారద (గుంటూరు)

* * *

## వెయిటింగు రూములో...

రైళ్ళలోనూ, బస్సులోనూ ప్రయాణం చేస్తున్నప్పుడు మనం సాధారణంగా చిత్రవిచిత్రమైన సంఘటనల్ని చూస్తూ వుంటాం. మనమే ఎదుర్కోవలసివస్తుంది కూడా ఒక్కొక్కప్పుడు. మొన్న ఆంధ్ర పత్రికలో, మతుకుపల్లి సుశీలగారు వ్రాసిన “తలుపుదగ్గర అమ్మాయి” (నవంబరు 7) చదివింతర్వాత ఈమధ్య జరిగిన ఒకనాటి సంఘటన జ్ఞాపకం వచ్చింది.

నేనూ, మా అన్నయ్యా రాయపూర్ మెయిల్లో జార్సుగూడనుండి బయలుదేరేం. రాయపూర్ చేరుకునేసరికి ఉదయం 9 అయింది. అక్కడనుండి విశాఖపట్నం వెళ్లాలంటే మళ్లా సాయంత్రం 5 గం. క్కాని బండీ లేదు. సామానంతా వెయిటింగ్ రూములో పెట్టించేసేం. నేను ఆడవాళ్ళ రూములోనే కూర్చున్నా. ఆ ప్రక్క రూము మగవాళ్ళది, అక్కడ, అన్నయ్య తన బెడ్డింగు ఒక్కటే వుంచుకున్నాడు తక్కిన సామానంతా నాదగ్గరే వుంది. దువ్వెన, అద్దం స్నానానికని టవలు అన్నీ అన్నయ్య నన్నడిగి తీసుకు వెళ్ళేడు. స్నానాలయేక మా భోజనం రూముకే తెప్పించుకున్నాం. అక్కడ ఆడవాళ్ళంతా తమ సామాన్లు చూస్తూ వుండమని నాకు ఒప్పచెప్పి, భోజనాలకి వెళ్ళిపోయేరు మేం రూములో భోజనం చేస్తూ వుండగానే, వెళ్లినవాళ్ళు ఒక్కొక్కరే చేరుకున్నారు భోజనాలు ముగించుకుని.

మధ్యాహ్నం షాపింగ్ కని ఊళ్ళోకి బయల్దేరి అంతా ముగించుకుని 3 గంటలకలా రూముకి చేరుకున్నాం. అప్పటివరకు మాత్రం, “ఎక్కడికి కెళ్తున్నారు? ఎక్కడనుండి వస్తున్నారు?” అన్నప్రశ్నలు ఎవరూ వెయ్యలేదు కాని మేం రూముకి తిరిగి వచ్చేక మాతో పాటే ప్రొద్దుటనుండి రూములో వున్నావిడ ఈ ప్రశ్నలు నన్నడగక విడిచిపెటలేదు జవాబు చెప్పి నేను పుస్తకం చదువుతూ కూర్చున్నా.

‘ఏంపని’ అనడిగింది. పుస్తకం చూస్తూనే సమాధానం చెప్పాను

నా వేషం చూచి నే పెళ్ళికాని పిల్లనని పోల్చుకుంటుందికదా మరెందుకు మా వగన చెప్పడమని వూరుకున్నా. కాని అలాగేం జరగలేదు.

ఇప్పటి ఫాషన్ ప్రకారం నా మెళ్ళో

(56 వ పేజీ చూడండి)

కాంతి అంతా స్వయంపాకపుమనస్తత్వం కలది! అది తేలికగా పుడుక్కుని ఏడ్చేసే రకంకాదు. దానికి ఆంతరంగిక సుగుణాలయందూ మమతాభిమానాల మీదా గురి ఎక్కువ. ఒకరకం ఏకాంతం కావాలి. అది ‘introvert’ మొదట ఈ తత్వంవల్ల తనవుతానై ఆలోచనలన్నీ తనకు సంబంధించినవిగానే ఉంటాయి. ఇదే క్రమంగా వృద్ధి పొంది, ప్రతి విషయానికి తన ఒక్క దృష్టితోనే కాక ఇతర్ల దృష్ట్యా చూడగలిగి ఒక సరియైన మార్గాన పరిష్కరించగలదు జీవిత సమస్యలని. ఈ కారణంచేతనే ప్రతి పనీ ఆలోచించి, ఆచి, తూచి, ఎదటివారికి బాధ కలగకుండా చేస్తుంది అయినా తనవల్ల ఇతరులకు కష్టం కలుగుతూందేమో నన్న అనుమానంవుండిపోవటంవల్ల స్తిమితం చెడుతుంది. కంగారుపడుతూ ఉంటుంది కూడా! బుబ్బుల్ని మందలించే విధంగా దీనిని మందలించకూడదు. ఇది మాట మరచిపోయేరకం కాదు. దీనిలో పొరపాట్లున్నా చూసీచూడనట్టూరుకోవడం శ్రేష్టం! ★




# మా ఊరి మఱ్ఱిచెట్టు

కవిమ్మసెట్టి వెంకటేశ్వరరావు

మావూరి మధ్యలో
మఱ్ఱిచెట్టొకటుంది
పచ్చనాకులతోడ
ముచ్చటగ ఉంటుంది.

గణుతింపరాని శా
ఖలతోడ రంజిల్లు
వేలాడిగా నున్న
విహగాలకది యిల్లు.

చల్లగా చిరుగాలి
మెల్ల మెల్లఁగ వీచు
అదిగాంచి ముదముతో
కొదమకోయిల కూయు.

కొమ్మకొమ్మలపైన
కోతులు ముదముతోడ
చెంగు చెంగునదూకు
చిన్ని పిల్లలతోడ.

పాంథులకు విశ్రాంతి
మందిరము ఆ తరువు
మాఊరి బీదవా
రల కదియె ఆ దరువు.

సాయంత్ర ముచ్చటకు
సంబరమ్మున వచ్చి
ఆడుదురు పిల్లలం
తా కోతి కొమ్మచ్చి.

అదిలేని మావూరి
కందమింతయు లేదు.
అదిలేక మాకు ఆ
నందము కలుగబోదు.

మావూరి మధ్యలో
మఱ్ఱిచెట్టొకటుంది
పచ్చనాకులతోడ
ముచ్చటగ ఉంటుంది.

# మాట విలువ

ఆఫ్ఘను స్థానాన్ని పరిపాలించిన మహమ్మదు గజనీ చక్రవర్తి చాలా సమర్థుడు. ఆయన తన మంత్రులతో, 'మీరు నాకు ఏమీ సలహాలివ్వనక్కర్లేదు. ప్రజలకేది క్షేమమో నేనే నిర్ధారణ చేస్తాను. నా ఆజ్ఞలను తు. చ. తప్పకుండా అమలు పరచడమే మీ పని' అని చెప్పేడు.

వారు, 'చిత్తం' అన్నారు కాని, ఆయన పథకాలలో వారికి ఏవేవో లోపాలు కనపడి ఆయన చెప్పిన దానికి తమ సొంత తెలివిని కూడా

పాలంకి
వెంకటరామచంద్రమూర్తి

కొంత చేర్చిగాని చక్రవర్తి ఫర్మానాలను అమలుపరిచేవారు కాదు. అందువల్ల వారు సార్వభౌముని ఆగ్రహానికి గురియై తమ 'పదవులను కోల్పోయేవారు.

ఒకనాడు ఈ అవస్థ ప్రధానామాత్యునికే పట్టింది. చక్రవర్తి ఆ అభాగ్యుణ్ణి సాగనంపి, 'నా ఫర్మానాలను అక్షరాల అమలు జరుపగల మంత్రియే అరుదై పోయాడేమిటి?' అని ఆలోచిస్తో కూర్చునే సరికి, అయాజ్ అనే బానిస ఆయనకు హుక్కాను తెచ్చి గద్దె ముందు పెట్టేడు.

అయాజును చూడటంతోనే చక్రవర్తికి ఒక ఆలోచన తట్టింది. మెడలో ధగధగ మెరిసిపోతోన్న మణిహారాన్ని తీసిఇచ్చి, 'అయాజ్ దీనిలోని నాయకమణిని రాతితో పగలకొట్టి పొడిచేసి పట్టుకురా!' అన్నాడు.

అమూల్యమైన ఆ రత్నాన్ని అయాజు కొంచెం కూడా వెనుదీయ



"చల్లగాలిలో యమునాతటిపై
శ్యామసుందరుని మురళీ...."

—ఫోటో: వి. కె. శర్మ



# మాటవిలువ



కుండా ఇటుకను పొడిచేసినట్లుగా చేసిపెట్టి, 'ప్రభువుల ఆజ్ఞ పాటింపబడింది!' అని చేతులు జోడించుకు నిలబడ్డాడు. సభలోని ఉద్యోగస్థులంతా నిర్ఘాంతపోయారు.

"అయాజ్, నీవు బద్దలుగొట్టిన ఈ రత్నంవిలువ నీకు తెలుసునా?"

"తెలుసు ప్రభూ. దీనిని అమ్మిన వర్తకునకు రెండు లక్షల బంగారు నాణాలను చెల్లించగా నేను చూచాను" అన్నాడు అయాజు.

"ఇంత విలువైనదని తెలుసుండీ కూడా ఈ మాణిక్యాన్ని చిల్లపెంకులాగ పొడి చేసి ఊరుకున్నావే!" అన్నాడు చక్రవర్తి.

"ప్రభూ, ఈ మాణిక్యం విలువైనదే. కాని తమ యాజ్ఞ కన్నా విలువైనది కాదు! తమ ఆజ్ఞను పాలించడమే నా విధి!" అన్నాడు అయాజు.

చక్రవర్తి మహదానందంతో, "అయాజ్, ఇప్పుడు ఖాళీ ప్రధానామాత్యపదవిలో నిన్ను నియమిస్తున్నాను" అన్నాడు.

"ప్రభువుల ఆజ్ఞను పాలించడమే నా విధి!" అన్నాడు అయాజు మళ్ళీ. "ఈ బానిసా, ప్రధానామాత్యుడు! చక్రవర్తి వీడికి ఈ గొప్ప పదవిని ఇవ్వడం, తగుదునంటూ వీడు సిద్ధపడడం లక్షణంగానే ఉంది!" అని ఆశ్చర్యపోయారు దర్బారులో వాళ్లంతా. కాని పైకి అనడానికి ఎవరూ సాహసించలేదు.

చక్రవర్తి మంత్రిహోదాకు తగ్గ విలువైన దుస్తులను రప్పించి, అయాజు కిప్పించాడు. అదివరలో మంత్రులకుమల్లే కాకుండా అయాజు రాజాజ్ఞలను విధిగా పాటిస్తూ చక్రవర్తి మెప్పును అచిరకాలంలోనే పొందగలిగాడు.

కాని గొప్పవాళ్ళ మనుకున్న ఆ ఉద్యోగస్తులందరికీ, ఒకప్పుడు బానిసయై ఇప్పుడు మహామంత్రియైన అయాజుక్రింద పని చెయ్యడమంటే నామోషీగా ఉండేది. చక్రవర్తికి అయాజుపైన ఎలాగైనా ఆగ్రహం కలిగించాలని వాళ్ళంతా కుట్ర చేశారు.

ఉపమంత్రులలో ఒకడు చక్రవర్తితో ఒకనాడు, "ప్రభూ, మహామంత్రి రోజూ తెల్లవారుఝామున రహస్యంగా పట్టణం వెలుపలకు పోయి వస్తూండడం గమనించాను" అన్నాడు.

"రేపు తెల్లవారుఝామునవచ్చి నాకు దారి చూపు. మహామంత్రి ఎక్కడకు పోతూన్నది గమనిస్తాను" అన్నాడు సార్వభౌముడు.

మరునాడు తెల్లవారు ఝామున వారు దూరంగా అయాజును అనుసరించి వెళ్ళేరు. అయాజు పోయి పోయి ఒక జీర్ణకుటీరాన్ని ప్రవేశించడం చూశారు. వారా పాకను సమీపించి చూచేసరికి, అయాజు ఒక కొయ్యపెట్టె మూత తెరిచి లోనికి చూస్తూ కనపడ్డాడు.

"ఖజానాలోంచి అపహరించిన సొమ్ము ఉంటుంది!" అన్నాడు ఉపమంత్రి, సుల్తానుతో.

"తినబోతూ రుచి ఎందుకు? ఊహించుకోడంకన్న అందులో ఏముందో చూసేస్తే తెలిసిపోతుంది" అంటూ సుల్తాను లోన ప్రవేశించి, "అయాజ్, ఏమిటీ పెట్టెలోది?" అన్నాడు.

"నేను బానిసగా ఉన్నకాలంలో ధరించిన చింకిపాతలు ప్రభూ. అధికారగర్వంవచ్చి కళ్ళు నెత్తిపైకి పోకుండా ఉండటంకోసం రోజూ ఉదయమే వచ్చి, ఈ గుడ్డలను దర్శించి, పిమ్మట అల్లాను ప్రార్థించి, దర్బారుకు వస్తూంటాను" అన్నాడు అయాజు.

నాడు దర్బారులో చక్రవర్తి, అయాజుకు అధికార గర్వమనేది రవంతకూడా లేదని, ఉద్యోగులందరికీ వెల్లడిచెయ్యదలచి, ఉన్నట్టుండి సింహాసనం దిగేడు.

"అయాజ్, నాకు బదులు నీవు నేడు సింహాసనాన్ని అధిష్ఠించు" అన్నాడు సార్వభౌముడు.

అయాజు, "రాజాజ్ఞను అమలు పరచడమే నా విధి!" అంటూ తొణుకూ, బెణుకూ లేకుండా పోయి సింహాసనం మీద కూర్చున్నాడు. సభ్యులందరూ అయాజు సాహసానికి ఆశ్చర్యపోయారు

"నీ విప్పుడు చక్రవర్తివి. నన్ను నీ వాజ్ఞాపించవచ్చును" అన్నాడు సుల్తాను

గద్దెపైనున్న అయాజు రాజును ఆజ్ఞాపించాడు: "మత్తు పదార్థములనూ, హుక్కానూ మితిమీరి సేవింపకుము, ఎంతటి రాచకార్యమున్ననూ మూడు వేళలయందునూ నమాజు చేయుట మానకుము" అని ఆజ్ఞాపించాడు. చక్రవర్తి కిరీటాన్ని తలపై నుంచుకుని ఆ సింహాసనం మీదనున్న ఆ కాస్సేపటిలోనూ అతడు తన బంధువులకూ, స్నేహితులకూ మంచిమంచి ఉద్యోగాలో,

(48-వ పేజీ చూడండి)